**ఉపాధ్యాయ ఉద్యమంలో నాకు సహచరుడు,**

**మావూరిచరిత్రతో నన్ను**

**చరిత్రతొవ్వల్లో నడిపించిన మార్గదర్శి,**

**కవి,చరిత్రకారుడు**



**గురువంటి శ్రీ విరువంటి గోపాలకృష్ణ గారికి**

**'ఆలేటికంపణం కథ' అంకితం**

**సొంతూరిమీద ప్రేమాత్మీయతలతో**

**నా ఈ తొలిచరిత్రపుస్తకాన్ని**

**అచ్చేయిస్తున్న**

**మా అభిమానవైద్యులు**



**శ్రీ డా. బెజ్జంశెట్టి నాగేందర్(కొలనుపాక) గారికి,**

**(కన్సల్టెంట్,శివసాయి హాస్పిటల్స్,ఉప్పల్,హైద్రాబాద్)**

**ధన్యవాదాలు.**

ఆలేటికథః

మావూరు ఆలేరు. నల్లగొండజిల్లాలో ఒకగ్రామం. మావూరు ఒక నదీలోయనాగరికత నింపుకున్న పల్లెదీవి. ఎక్కడ తడిమినా ఊటలూరే చారిత్రకసంపదల నీటిచెలిమలు. లెక్కకుమిక్కిలి కాలువలు. వూరు చుట్టూ వాగుల వడ్డాణం.

చరిత్రలో పేర్కొనబడుతున్న షోడశజనపదాల్లో అస్మక(అశ్మక , అస్సక,అసక,అళకపేర్లతో)జనపదం ఒకటి.ఆ అస్మకజనపదం తెలంగాణాలోనిదే.తెలంగాణాలోని వివిధప్రాంతాలలో నాగులు, యక్షులు, అశ్మకులు,మహిషకులు,తెలుగులువంటి జాతులు నివసించాయి. రామాయణంలో ప్రస్తావించబడిన మహిషకులరాజ్యం నల్లగొండ ,మెదక్ జిల్లాల్లో వుండేది.పురాణాలవల్ల మగధనేలిన మహాపద్మనందుడు అశ్మకను ఆక్రమించినట్లు తెలుస్తున్నది.మౌర్యులు(చంద్రగుప్తుడు,అశోకుడు), శాతవాహనులు,ఇక్ష్వాకులు,విష్ణుకుండినులు,రాష్ట్రకూటులు,పశ్చిమ, కళ్యాణిచాళుక్యులు,కందూరిచోడులు,కాకతీయులు,పద్మనాయకులు,బహమనీలు,కుతుబ్షాహీలు,నిజాంరాజులు తెలంగాణానేలిన అందరి పాలనలో ఆలేరు ఉన్నది.

***ఆలేటి ఉనికిః***

భౌగోళికంగా ఆలేరు 17.65డిగ్రీల ఉత్తరఅక్షాంశం ,79.05డిగ్రీల తూర్పురేఖాంశాలపై ఉన్నది.సముద్రమట్టానికి 361అడుగుల ఎత్తున వుంది. మావూరునుండి (163) 202 జాతీయరహదారి వెళుతున్నది.

మావూరు చుట్టువున్న వూర్లన్ని ఎత్తుమీదున్నవే. సాయిగూడెం , ఇక్కుర్తి, లక్ష్మక్కపల్లి, బొందుగుల, రాజపేట, ఇంకా కొన్నిగ్రామాల్లో చిన్న చిన్న రాతిబోళ్ళు. భువనగిరి , రాయగిరి, సైదాపురం, మాసాయిపేట,

గొలనుకొండ, మరికొన్ని గ్రామాల్లో 30,40 అడుగులనుండి 100 అడుగులఎత్తున్న గుట్టలు చుట్టూరా విస్తరించివున్నాయి. అక్కడక్కడ ఏనెలు కూడా అగుపిస్తాయి.

నిజానికి మావూరిది నల్లరేగడి నేల. ఒకప్పుడు వూరి పైనుండి పారిన వాగులవరదల్లో మట్టిపొరలు కొట్టుకుపోయి వూరిలోని ఈశాన్యప్రాంతమంత చౌడుభూములైనయి.కాలువగట్టు పొలాలు ఇసికపాలెక్కువున్న పొలాలు.వూరికి నైరుతిదిక్కున నల్లరేగడి చెలకలున్నాయి. ఆలేరువాగుకు తూర్పున ఎర్రనేలలున్నాయి.

మావూరిలో జొన్నలు, సజ్జలు, తైదలు(రాగులు) , మొక్కజొన్నలే కాక రాజనాలు , మైలసన్నలు, సాంబలు, గొట్టొడ్లు, వాసనవడ్లు, చిట్టిముత్యాలువంటి రకరకాల వరిధాన్యం పండించేవారు. మిరప , ధనియాలు, పొగాకు, ప్రత్తి, కందులు, పెసర్లు, బొబ్బెర్లు, సెనగలు, ఆముదాలు, కుసుమలు, వేరుసెనగ, నువ్వులు (పొద్దుతిరుగుడు కొత్తగాచేరిన పంట)తప్పనిసరిగా పండించేవారు. కూరగాయలకు కొదువలేని వూరు. చేన్లల్ల దోసకాయలు , బుడమకాయలు, ఆనప కాయలు, బీర, బెండ, వంకాయ, టమాటలు పండించేవారు. వూరిలో తీగెపారే ఆకుకూరలు , కూరగాయల పందిళ్ళులేని ఇల్లే వుండేదికాదు. రెండుచేదలకే నీళ్ళందే చేదబావులుండేవి. దరిబావులు , ఒరలబావులు మోటలతో తెల్లవారు జామున పాటలుపాడేయి. పర్రెకాలువలనీళ్ళు పంట పొలాలకు ఆదరువులై వుండేయి.

***ఆలేరు పేరు కథః***

చిన్నప్పుడు మా తాత (అమ్మతండ్రి) ఈ వూరిలో పెద్దపులులనే తరిమేటన్ని ఆవులమందలుండేవని అందువల్లే ఆవులున్న ఈ వూరు ఆవులూరు లేదా ఆవులేరుగా , రాను రాను ఆలేరుగా పిలువబడ్డదని

చెప్పేవాడు. కాదు ఆరు ఏరులుపారే ఊరే ఆలేరుగా పేరుపొందిందని కొందరివాదం. దానికి బలంకల్పించే కైఫీయతు ఏమిటంటే ఒకరాజు ( ?) రంగనాయకుని విగ్రహాన్ని తనరాజ్యానికి తీసుకపోతున్నపుడు విగ్రహమున్న బండి ఇక్కడి నదిపాయలో దిగబడిపోయి కదలలేదట. అపుడు రంగనాయకదేవుడే రాజుకు కలలో కనిపించి 'శ్రీరంగపట్నంలో సప్తకావేరులున్నట్టు ఇక్కడ ఏడుపాయలు ప్రవహిస్తున్నందున ఇక్కడే తనవిగ్రహాన్ని ప్రతిష్టించి దేవాలయం నిర్మించమన్నా 'డట. ఈకథను రంగనాయకుని గుడిపూజారి కీ. శే. కొండమయ్యగారి భార్య చెప్పింది. అందువల్ల ఆలేరులో ఏడుప్రవాహాలుండడం వల్ల ఏరులవూరు ఆలేరు అయిందంటారు కొందరు. ఈ దేవాలయంలో 16 వ శతాబ్దంలో రంగనాయకుడు ప్రతిష్టించబడితే క్రీ.శ.1034నాటి సైదాపురం శాసనంలో పేర్కొన్న ఆలేరు కా పేరట్లా వచ్చే అవకాశమే లేదు.

మరో ఆంగ్లనామప్రతిపాదన చూడండి. A Lair అంటే Chambers' Dictionary ఇచ్చే అర్థం 1. ఒక దాచుకునేస్థలం అంటే గుహ లేదా అడవి జంతువుల విశ్రాంతి ప్రదేశం , 2. జంతువుల సురక్షిత ప్రదేశం. . . ఆలేరు పేరును అలయార్ అని తెలుగులో , ఆంగ్లంలో Alairగా కార్యాలయాల శిలాఫలకాల మీద చెక్కిన తమిళశిల్పి రాతలకు ఒకరి వ్యాఖ్యానం. రెండువేల యేండ్ల కిందటి వూరికి ఈ ఇంగ్లీష్ పేరెట్లా వస్తుంది?రాదు. ఆవులేరు ఆలేరుగా మారడమే పరిణామపద్ధతి.

కళ్యాణిచాళుక్యుల ఏలుబడిలో ఆలేరు ఒకకంపణం. కంపణం అంటే ఒక దేశవిభాగం. కన్నడభాషలో కంపణమంటే మండలం లేదా విషయం అని అర్థం. (ఇప్పటిలెక్కన ఒక జిల్లాకు సమానం. )

(ప్రాచీనాంధ్ర చారిత్రకభూగోళం– కందూరి ఈశ్వరదత్తు. . పే. 41)

ఆలేరుకు 6కి.మీ.ల దూరంలోవున్న కొలనుపాక పశ్చిమచాళుక్య చక్రవర్తులకు కొంతకాలం రాజధాని , మరికొంతకాలం ఉపరాజధానిగా వుంది.సైన్యాన్ని ఆయత్తపరిచే నెలవీడు , ఉపాయనవీడు (Preparatory camp) గా వుండేది. 10 వ శతాబ్దంలో కొలనుపాక-7000ల గ్రామాలకు రాజధాని. (కొందరు ఏడువేల ఆదాయపరిమితిగల ప్రాంతం అని వివరించారు.)ఆ కాలాన ఆలేరుకంపణంగా వుండేది. కంపణం అంటే 40 నుండి 60 గ్రామాలకు కేంద్రంగా వున్న పాలకప్రాంతం.చాళుక్యచక్రవర్తి జగదేకమల్లుని కాలాన కొల్లిపాక-7000 విభాగంలో ఆలేరు-40 కంపణంగా వుండేది. ఒక ప్రాంతీయాధికారి ఇక్కడ పాలకుడుగా వుండి కంపణంలోని గ్రామాలను ఏలుతుండేవాడు. ఆలేరు-40 కంపణంలో గ్రామాలు పడమరన భువనగిరిదాకా , దక్షిణాన పులిగిళ్ళ, సుంకిశాలదాకా, తూర్పున వెల్మజాలదాకా , ఉత్తరాన కొన్నె మొదలైన గ్రామాలదాకా విస్తరించి వున్నట్లు తెలుస్తున్నది.

***ఆలేరు చరిత్ర:***

ఆలేరులోని రెడ్డికాలువ ఒడ్డున ఆలేరుశాసనం బయల్పడింది. నల్లగొండ జిల్లా శాసనసంపుటి- 1లో 42 వది ఆలేరుశాసనం. ఆలేరు నుండి కొలనుపాక దారిలో (గ్రామ సచివాలయం) రెడ్డికాలువ ఒడ్డున లభించిన శాసనంలో శాసనకాలం విశ్వావసు సం.(క్రీ. శ. 1125) కావచ్చు.జయంతిపురం రాజధానిగా పాలిస్తున్న త్రిభువనమల్లదేవుని కాలంనాటిది.ఈ శాసనంలో ఆలేరు- 40కంపణం సవదొరెగా సోమనాయకుడు పేర్కొనబడ్డాడు. వేమిరెడి , బూదిరెడి పేర్లు కూడా రాయబడివున్నాయి.

ఆలేరు శాసనపాఠం:

శాసనం 1వ వైపు

. . . . . . . . . . .

సమస్త భు

వనాశ్రయ

శ్రీ ప్రిథ్వీ వ

ల్లభ మహా రా

జాధిరాజప

రమేశ్వర ప

రమ భట్టా

రక సత్యాశ్ర

యకుళ తిళ

కం చాళుక్యా

భరణం శ్రీ మ

త్రిభువన మ

ల్ల దేవర వి

జయ రాజ్యము

త్త రోత్తరాభి

వృద్ధి ప్రవర్ధ

మానమాచం

2వ వైపు

ద్రార్కతారం జ

యంతీపురద

నెలెవీడి నొ

ళుసుఖ సంకథా

వినోదదిం రాజ్యం

గెయ్యుత్తరమిరె

శ్రీమచ్చాళు

క్య విక్రమ

వర్షద 50 నెయ

విశ్వావసు సం వ

త్సరద ఆశ్వ

యుజ బహుళ

(1) సోమవారదం

దు ఆలేఱ న

ల్వత్తఱ సవదొ

రె సోమనాయ

క్కం వేమిరడి

బూదిరడి

యు అవన

3, 4 వైపుల రాతలు జీర్ణమై వున్నాయి

(Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 42, p:115-117)

ఆలేరు-40 కంపణానికి సవదొరెగా సోమనాయకుడు పేర్కొనబడ్డాడు.సవదొరె అంటే రాజరక్షకుడు.సవదొరె పిలుపే కాలక్రమాన 'చౌదరి'గా పరిణమించినట్లున్నది. మావూరిలో చౌదరుల కుటుంబాలు 12 వుండేయి.

మరొక శాసనాధారము: ఆలేటిశాసనం కంటె 90 ఏండ్లకు ముందుగానే ఆలేరు గురించి సైదాపురం (క్రీ. శ. 1034 జూన్ 4వ తేది ) శాసనంలో ఆలేరు-40, ఆలేరుకంపణంగా పేర్కొనబడింది.

ఆలేరును పేర్కొన్న సైదాపురం శాసనం (యాదగిరిగుట్ట దగ్గర) .

ఆ శాసనంలో

1వ వైపు

స్వస్తి సమస్త భువనాశ్రయ శ్రీ పృ
థ్వీ వల్లభ మహారాజాధిరాజ
పరమేశ్వర పరమభట్టారకం
సత్యాశ్రయ కుళతిలకం చా
ళుక్యాభరణం శ్రీ మజ్జగదే
క మల్లదేవర్ సక వర్ష956
నెయ భాను సంవత్సర జేష్ట
ద పుణ్ణమి బృహస్పతి
వారదన్దు పొట్టళకెఱె
య నెలవీడి నొళ్సోమగ్రహణ మ
హా పర్వనిమిత్తదిం వైద్యరత్నాకరం ప్రా
ణాచార్య నగ్గళయ్యన భిన్నప దొళ్ళ
కొల్లిపాకె-7000 దొళగణ ఆలే
ఱు-40 అ బళియ ముప్పనపళ్ళి యొళ
గ్గళెయ్యన మాడిసిద బుద్ధసేనజినా
లయక్క మిక్కుటికి యొళె మాడిసిద వైద్యర
త్నాకర జినాలయక్కం ముచ్చనపళ్ళియ గావు
ణ్ణం నరవైద్య నగ్గళయ్యన మాడిత మయా

ర్దె యొళాయెరదు బసదియ భోగక్కం ఖ

ణ్డ స్ఫుటిత నవసుధాకమార్దిగళం జా

కబ్బెయ రెకబ్బెయ బసదియ ప్రతిబద్ధ

కజ్జికాస్థానమాగె దేవభోగం తత్ప్ర

తిబద్ధం బుద్ధిపాకె వాళిగె స

బెతం బిట్ట ముప్పనపళి యొళ్దులల్లెవపం

హి. .

2వ వైపు

. . నిర్దే హోయస (తాం హితాయ విదుషాం. . )

తాత్మానామారోగ్యాయన్రుణాం సుఖాయ సుహృదాతు.

ష్టై గురూణాంసదారక్షాయై జినశాసనస్యభిష

జాం శాస్త్రక్రియా సంశయాష్ట్యెద్యుచ్చేదాయచ ప

ద్మ భూస్సహజవైద్యరత్నాకరః. . . .

ఆయుర్వేద విదాంయేశాస్త్ర

కర్మక్రమేప్రౌఢాశ్రీ జగదేకమల్లయః

న్రుపతేర్యే శాస్త్రపారంగతాస్తేషాం

సంసది శస్త్ర శాస్త్రకుశల శ్రీ

వైద్యరత్నాకరః జేతా

నా బల రగ్గళ బు

ధనిధి శ్శస్త్రేణ శాస్త్రే

ణావా. . . .

యద్యత్ర శస్త్రాదిషుకర్మ

కరోతి లోకత్వంతు ప్రపేత్పినరవై

ద్యక మగ్గళార్యః దివ్యం తథాపది

ద తదాపి సుఖం విధాతుం సింహస్యత స్యచ (జయసింహ)

పి పరైర్భిషగ్భిర్వ్యాధి ప్రకర్షె తదు

క్షం నిరూహ దక్షం కథయంతి దిక్షు

ఉమాతంత్రమాద్యం ల. . . సంగ్రహ పరిచ్ఛేద

క్రియాకౌశలోద్దామ ప్రథిత శస్త్ర శా

స్త్రవిషయ ప్రాగణ్యమనూర్జితప్రదం

కమ్మిగ చక్రవర్తి జయసింగం మె

. . . . . . . . . . . . . . . . . . . . . . .

. . . . . . . . . . . . . . . . . . . . . .

3వ వైపు

ప్రదియెళర సంగె (పణ్డరాగరకుడువ) జయ

సింగం దా గద్యాణ. . . బసది రక్కెబా

డరకవొన్దు రాటాణ మెరడు కరెయ నేల

. . కిసుకాడు మాగెమత్తర్నాఱు పూ

దోంట మొన్దు నివేశనం పత్తు (ఘర) ద్రమ్మ

మొన్దుగావుంణ్డన మాన్యద పాఱగా

గెఱకిదమామియోళ్పన్నెరడఱ కొల

గావుణ్డన. . . . ట్టర. . . డుకొ. . .

ణ్డదోయ పిరియ కెయ్యమద్మణ్ణమ

మ్మడియ బిట్టద తెంకణ మద్దిన

ధు వియ్గెం చికబెయోళ్ ఊ. . . కాల్గ. . . . . . . . . . . . .

ళొళ్గెల్ల. . . . . . . . . ణాముఱు పూణం

. . . . . . . . . . . . ల్గళ ప్రతిబద్ధ . . . . . గిళాల

గెయ్దు ద్రమ్మం ఘర ద్రమ్మని మొన్దు

వణ. . కొణు సోయారమియ్దొన్దు తాళబసమొన్దు పా
లె త్పం. . తొఱెయద డయొళద్యాం పడువణ
. . . . ణుస యగామెమెం యాగె పడువలు మూడ
లు నన్దనవన మెన్యెయ తొణక్కం మత్తాన్నార్వల్వ
త్త. . . మూడగణద్దెమె బెట్టదసా మా మాన్య
దకెయ బోఅయ్యదె. . . . పిదగణ బెట్టద
. . . . . . కెయ్యత్త మూనూఅయ్యత్తు ఆయూ
రసీమె దిశాగదొళ బియ కన్దుకూర కతన క
ఱెయ దశాన ప కాణొందు
మూఋపల్లె ఆగ్నేయ దొళ్దు సనకుందెయ న
మావరిష్ణ గండద కల్లోన్దుళుం గెయతాం
నడకల్లోన్దు తెంకల్వ యెంబూ. . వీరెమొళె. .
. . . . . కల్లదిన్దునొ తెమొళ్వెలంగ కుళెయొ
న్దు పడువణదె. . . యొ. . . న్దువాయ
వ్యదొళె అవికుంటెయ మాకె. . ప్పణుసె
యకం. . . .

ఈ శాసనంలో క్రీ. శ. 1034 జూన్ 4వ తేదీన పొత్తలకెఱె ( పటాన్ చెరువు) వద్ద శిబిరంలో వున్న కొలనుపాక-7000 నాడు మహారాజు జగదేకమల్ల-1 చంద్రగ్రహణ సందర్భంగా వైద్యరత్నాకర, ప్రాణాచార్య, శస్త్రశాస్త్రకుశల శ్రీ అగ్గలయ్య కోరిక మేరకు ఆలేరు-40 కంపణంలోని ముచ్చనపల్లి వద్ద నిర్మించిన బుద్ధసేనజినాలయానికి, ఇక్కుర్తి లోని వైద్య రత్నాకర జినాలయానికి కానుక ఇచ్చినట్లు తెలుపబడినది. ఇంకా ఆలేరు గ్రామం చుట్టు వున్న గ్రామాలు కాలువల వివరాలు చెప్పబడివున్నాయి.

( Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 5, p:7-10)

మరొక సైదాపురం శాసనం Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 6, p:11-12 లోని 12 వ పంక్తిలో కూడా ఆలేరు కంపణం ప్రస్తావించబడ్డది.

కళ్యాణపురనివేశితుడు త్రిభువనమల్లదేవచక్రవర్తి రాజ్యకాలంలో వేసిన క్రీ.శ. 1106 ఏప్రిల్ 6నాటి కొలనుపాక శాసనంలో కొలనుపాకలో వుండి పరిపాలిస్తున్న మహామండలేశ్వరుడు పారమారజగద్దేవుడు భువనగిరికోట దండనాయకుడు బమ్మదేవుడు (ధక్కన కుమారుడు) నిర్మించిన భువనగిరిలోని సోమేశ్వరతీర్థానికి అంగరంగ భోగాలకు, అనుబంధంగావున్న మఠంలోని విద్యార్థుల స్వాధ్యాయానికి ఆలేరు-40 కంపణంలోని గోష్టిపాళు గ్రామాన్ని సర్వమాన్యంగా దానంగా యిచ్చినట్టు 'ఆలేటి కంపణక మధ్యే గోష్టిపాళు నామగ్రామ మనంగుళి ప్రేక్షణీయం పరిహృత సర్వర్కర బాధం దేవభోగకృత ధారాపూర్వకం' అని తెలుపబడివుంది. ( Inscriptions of A.P.Nalgonda Dist. Vol. I, No. 26, p:69-72) గోష్టిపాళు అంటే ఆవులపల్లె అని అర్థమని , ఆవులవూరు, ఆవులయేరు, ఆలేరుకు సంస్కృతీకరణమే 'గోష్టిపాళెం' అయివుండొచ్చని చారిత్రకపరిశోధకుడు విరువంటి గోపాలకృష్ణ అభిప్రాయపడ్డారు.

అది కాక ఆలేరుకు 3కి.మీ.లపైన పడమటిదిక్కున ఉల్లిపాటిగడ్డగా పిలువబడే పాతవూరు ఆనవాలుంది. దీనికి ఉత్తరాన పారుతున్న వాగును గొల్లోనిఒర్రె అని పిలుస్తారు. ఈ ప్రదేశంలోని భూములను 'గొల్లోనిమాన్యం'అని కూడా పిలుస్తారు ప్రజలు. దొరుకుతున్న ఇటుకలు, పెంకులు, రోళ్ళు, పనిముట్ల ఆధారంగా పూర్వం ఇక్కడ ప్రాచీన ఆవాసం , పురాతనగ్రామం వుండేవని తెలుస్తున్నది. ఈ వూరే 'గొల్లగూడెం' అయ్యే అవకాశం ఎక్కువ. గొల్లగూడెమే గోష్టిపాళెం

కావచ్చు. అపుడు త్రిభువనమల్లుని శాసనంలో పేర్కొనబడ్డది ఈవూరే అవుతుంది.

తేది, సంవత్సరం లేని 6వ త్రిభువనమల్ల విక్రమాదిత్యుని (క్రీ.శ. 1076-1126) చందుపట్లదానశాసనంలో భువనగిరి , చందుపట్ల, వీరవల్లి, పులిగిళ్ళ మొదలైనవి ఆలేరు-40 కంపణంలోని గ్రామాలుగా పేర్కొనబడ్డాయి.

( Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 37, p: )

***ఆలేటి ఏటిపుట్టుకః***

ఎగువమానేరు రిజర్వాయరు (కరీంనగర్) నుండి మల్కపూర్ , నష్కల్, భూంపల్లి, మిరుదొడ్డి, అందె, ఆకారం, తీగుడి, జగదేవపూర్లో మెదక్ జిల్లా దాటిన మానేట్లో కలిసే ఏరు గంధమల్ల , బేగంపేట, రేణికుంట, రఘునాథపురందాటి కుర్రారంనుండి వచ్చినవాగు దూదివెంకటాపురం వాగులోకలిసి కొలనుపాకకు పశ్చిమదిశగుండా దక్షిణదిశలోపారి ఆలేరునదిలో కలుస్తుంది.

దిగువమానేరు రిజర్వాయరు (కరీంనగర్)నుండి మొదలైన వాగొకటి రామెంచదగ్గర చీలి రెండుదిక్కులకు వెళ్ళింది. ఒకటి వర్కోల్ వైపు , మరొకటి రామెంచవైపు. ఒకపాయ వర్కోల్నుండి కోహెడ (మోయు తుమ్మెదవాగు), శనిగరంచెరువు, బసవాపూర్, నంగునూరు, ధూళిమిట్ట, బైరాంపల్లి, ఆకునూరు (దాటినంక మరొకపాయ) , చేర్యాల, బచ్చన్నపేట నుండి కొలిపాకకు ఉత్తరం , తూర్పుదిశల్లోపారి ఆలేరుకు ఈశాన్యాన రెండుపాయలు కలిసిపోయి ఆలేరునదిగా రూపొందుతున్నది.

ఆలేరునదీలోయ నాగరికతః ఆలేరునదిపైవున్న బస్ బ్రిడ్జికి దక్షిణంగా 1 కి.మీ. దూరంలో శాయిగూడెం గ్రామానికి పడమటవున్న

నల్లగుట్టపరిసరప్రాంతాల్లో నదిఒడ్డున స్తరీకృతప్రదేశాలలో తొలిపాతరాతియుగపు ఆవాసాల ఆనవాళ్ళు ,పనిముట్లు కొన్ని లభించాయి. ఆలేరుపట్టణానికి పడమరదిశలో గొల్లోనిఒర్రె , ఈదులవాగు అని వర్షాకాలంలో పారే సెలయేళ్ళున్నాయి.ఈదులవాగులో కూడా వంతెనకు దక్షిణంగా అరకిలోమీటరుదూరంలో తొలిపాతరాతియుగపు ఆనవాళ్ళు దొరికాయి. అంతేకాదు , వంగపల్లివాగు, రాయగిరివాగుల్లో కూడా తొలిపాతరాతియుగం , మలిపాతరాతియుగం ఆనవాళ్ళు , పనిముట్లు లభించాయని , భువనగిరికొండపరిసరాల్లో ఉపరితలంలోనే మలిపాతరాతియుగం పనిముట్లు దొరికాయని ఎస్. నాగభూషణరావు (1966)తన పరిశోధకగ్రంథం 'Stoneage cultures of Nalgonda district'లో రాసాడు.

ఆలేరు పేరుమీదనే ఆలేరునది కాపేరొచ్చింది. అయినా మేం పెద్దవాగనే పిలుస్తుంటాం. మావాగు ఆలేరువాగుకు భిక్కేరు అనే మరో పేరుంది. బౌద్ధభిక్షువులు ఈ వాగు వెంటనే పయనించారని , విహారాలు నిర్మించారని వాగొడ్డున అక్కడక్కడ బయట పడుతున్న బౌద్ధం ఆనవాళ్ళు సాక్ష్య మిస్తున్నాయి. భిక్కేరొడ్డున చాడ (ఆత్మకూరు మండలం) లో ఇటీవల క్రీ.శ.2వ శతాబ్దంనాటి బౌద్ధస్తూపం అవశేషాలు , బుద్ధునివిగ్రహం లభించాయి. ఈ ప్రాంతంలో మహాయానం, వజ్రయానం వర్ధిల్లిన ఆనవాళ్ళు లభిస్తున్నాయి. ఈ వాగువెంట ఒక్కబౌద్ధమే కాదు , జైనం కూడా విశేషంగా వ్యాప్తిచెందింది.

ఆలేరువాగు మూసీనదికి ఉపనది. ఈ వాగు మెదక్ , నల్లగొండ జిల్లాల గుండా 118 కి.మీ.లు ప్రవహించి మూసీనదిలో కలుస్తున్నది. ప్రస్తుతమున్న ఆలేటివాగు ఒకప్పుడు ఆలేరుకు 3 కి. మీ. ల కవతల నుండి పారినట్టుగా ఇక్కడి భూమిలోని ఇసుకపొరలు సాక్ష్యమిస్తున్నాయి.

అందువల్ల ఆలేరుకు కొలనుపాకకు ఇప్పుడున్నవాగు అడ్డుగా లేకుండెడిదని చెప్పవచ్చు.

ఆలేరుకు పడమట ఇంకా రెండు వాగులు (వరదప్రవాహాలు) న్నాయి.

ఒకటి గొల్లోనిఒర్రె. గొల్లోనిమాన్యం నుండి పారే ఈ ఒర్రెకే గొల్లోని ఒర్రె , రత్నాలవాగు అని పేర్లున్నవి. కాని మా విరువంటి గోపాలకృష్ణ సార్ అది రత్నాలవాగు కాదు రాటనాలవాగంటాడు. నిలువురాతిస్తంభాల గాడుల్లో పొందించిన గడకర్రలతో నీళ్ళు తోడే నీటియంత్రాలను రాటనాలంటారు. అట్లాంటి రాతిస్తంభాలు కొలనుపాక గొల్లమఠం ముందర, మాసాయిపేట గుమ్మటాల దగ్గర వున్నాయి. రెండవ వాగుఃఈదులవాగు. ఇది చాలా చిన్నవాగు. రత్నాల వాగుకు పైన 1 కి. మీ. దూరంలో ప్రవహించే వాగు.

యాదగిరిగుట్ట దగ్గరిగ్రామాలు పెద్దకందుకూరు వాగునీళ్ళు , సైదాపురం, మల్లాపురం చెరువులు అలుగుపారిననీళ్ళు బైరోనిఒర్రె నుండి ఆలేరునానుకుని పారే రత్నాలవాగు , ఈదులవాగులలో పడి ఇక్కుర్తికే చేరుతాయి.

***ఆలేటి బాటః***

పూర్వం హైదరాబాదు నుండి వరంగల్ వరకు ఒక ప్రాచీనమార్గం వుండేది. ఆ మార్గం ఆలేరుగుండానే సాగి విజయవాడకుచేరి బంగళాఖాతంనంటుతున్నది. ఈమార్గంలోనే బౌద్ధభిక్షుకులు ప్రయాణించినట్లు తెలుస్తున్నది. సార్థవాహులుకూడా ఈ బాటలోనే బంగళాఖాతంచేరి, అక్కడనుండి విదేశాలకు నౌకాయానంచేసే వారట. సుత్తనిపాతంలో శ్రమణకులమార్గం ఆలేరుగుండానే సాగిందని రాసున్నదని మా చారిత్రకమార్గదర్శి విరువంటిగోపాలకృష్ణగారన్నారు.

(సుత్తనిపాతంగాథలుః9711, 1010, 1013-సార్థవాహులు, రచనఃమోతీచంద్. పేజి నెం. 54) . పూర్వం ప్రధాననగరాలైన అనుమకొండ, కొల్లిపాక, కోడూరు, అయిజ, మగతల, మస్కిలను కలుపుతు (ఇప్పటి వరంగల్ , హైద్రాబాద్, మహబూబ్ నగర్ , రాయచూరులను కలిపే) ముఖ్యమైనబాట ఉండేది. దీనిని పూర్వం దండుబాటగా పిలిచేవారు. చాళుక్యులకాలంలో కర్ణాటకలోని కొప్పం , రాయచూరు, తెలంగాణలోని కొలనుపాకకు ప్రయాణించే ప్రధానరహదారికి అడ్డంగా పోయే ఒక దండుబాట ఉండేది. అట్లే ప్రసిద్ధ శైవక్షేత్రమైన వేములవాడ నుండి కొలనుపాక గుండా శ్రీశైలానికి పోయే ప్రధానరహదారి వుండేది. సుత్తనిపాతంలో ప్రస్తావించిన బౌద్ధశ్రమణకులు సముద్రతీరం వరకు వెళ్ళడానికి నడిచిన దారి ఇప్పటి జాతీయరహదారేనని చరిత్రకారుల అభిప్రాయం. అంటే ఆలేరు నుండే వారు వెళ్ళివుంటారు.

(కొలనుపాకచరిత్ర—శాసనాలు రచనః విరువంటి గోపాలకృష్ణ)

ఆలేటి పాటిగడ్డకు 3 కి. మీ. ల దూరంలో దాతారుగూడెంలో గవ్వల రామస్వామిబాయి దగ్గర బురుజుగడ్డ వుంది. అది కొలనుపాక సైన్యాలు నడిచిన దండుబాట. కొలనుపాక రాజ్యానికి జాతీయరహదారి. అక్కడ కాపలాదార్లు వుండేవారు.ఇట్లాంటిదే రాజపేట మండలంలోని పారుపల్లిలో కూడా వుంది.



***ఆలేటికి పూర్వ చారిత్రకసాక్ష్యాలుః***

ఆలేరువాగు ఒకప్పుడు ఆలేరుకు దాదాపు 3కి. మీ. ల పైనుండి ప్రవహించివుంటుందని నా అభిప్రాయం. ప్రస్తుతమున్న ఆలేరుగ్రామానికి 3కి.మీ.దూరంలో(రఘునాథపురం,రాజపేట దారిలో)బొబ్బిలిమడుగు దగ్గర గొల్లోనిమాన్యంలో 'ఉల్లి'పాటిగడ్డ అని పిలిచే 'ఊరి' పాటిగడ్డ , పాతవూరు శిథిలాలున్నాయి.అక్కడ వ్యవసాయం చేస్తున్నవారికి మధ్యశిలాయుగపుఆకుకత్తులు, నవీనశిలాయుగపు గొడ్డళ్ళు,సుత్తెలు వంటి రాతిపనిముట్లు, మట్టిపూసలు,పెద్దసైజు (14★9 అం.)కొలతల ఇటుకలు, మందపాటిపెంకులు దొరుకుతున్నాయి.అక్కడ ప్రస్తుతం పారుతున్న వరదకాలువలతో ఏర్పడ్డ గొల్లోనిఒర్రె(గొల్లోనిమాన్యంలో పారుతు న్నందున పొందిన పేరు)అనబడే రత్నాలవాగు ఈవల దక్షిణదిశ ఒడ్డున రోళ్ళు కనిపిస్తున్నాయి.రెండు ,మూడడుగుల లోతులో ఇం డ్లనిర్మాణం చేసిన జాడలు కనిపిస్తున్నాయి.

  

అవతలిఒడ్డున ఏముకుంట (నేమికుంట?) దగ్గర రోళ్ళగడ్డ అని పిలువబడేచోటకూడా రోళ్ళు ,శిలాయుగపు రాతిపనిముట్లు దొరుకు తున్నాయి.కొలనుపాకకు నైరుతిదిక్కున అక్కడ నుండి పారుతున్న ఆలేరువాగుకు వరదలొచ్చి నపుడు వాగు చీది , పల్లానికి జారి, ఇపుడున్న గుండ్లగూడెం గట్టుకు తట్టుకుని నిలిచి సాగిపోయింది. వాగుతో పాటు వూరు ఇపుడున్న చోటికి తరలి వచ్చింది. నిదర్శనంగా వూళ్ళో మూడు ఆంజనేయుళ్ళున్నారు.గాఁవ్ జలే హనుమాన్ బాహర్ అనే జనోక్తి ప్రకారం ఆలేరు కనీసం 3 చోట్లకు మారిందని అర్థం. అంతేకాదు వూరిలో ఎక్కడ త్రవ్వినా అడుగున ఎక్కువగా ఇసుకపొరలు బయట పడుతుంటాయి.

***ఆలేరు నీటిపుట్టః***

వూరికి ఉత్తరాన ఒకప్పటి పెద్దవాగు (ఆలేరువాగు) ప్రవాహమార్గంలో ఊటపర్రెలు పదిదాకా ఏర్పడివున్నాయి.

అవే

1. ఏముకుంటపర్రె(వూరికి వాయవ్యాన 3కి. మీ. దూరంలో ఏముకుంట దగ్గర)
2. ఒంటిపర్రె (వూరికి వాయవ్యాన 2కి. మీ. దూరంలో బైరకుంట దగ్గర)
3. రామసముద్రం పర్రె
4. రెడ్డిపర్రె
5. ఇటుకరాళ్ళపర్రె
6. పెద్దపర్రె ( ముడిగెల నుండి పెద్ద కాలువ) సాయిగూడెం కాలువ
7. కొలిపాకపర్రె
8. తుంగచంద్రమ్మపర్రె
9. లచ్చిందేవి పర్రె
10. లొట్లపర్రె ( మంతపురికి కాలువ)

11. తలపర్రె లేదా ఇక్కుర్తి పర్రె ( తాటి ప్రమాణం లోతుండేదట) ( ఇక్కుర్తికి కాలువ)
12. బైరోని బొంద

ఇవి ఒకప్పటి ఆలేరువాగుమార్గంలో భూగర్భజలాలనిల్వలు. మా చిన్నపుడు చేయిపెట్టి తోడితేచాలు పర్రెలో నీటిజలలు పొంగుకొని వచ్చేవి. ఈ పర్రెల ఆధారంగానే నాకీ అభిప్రాయం కలిగింది. పర్రెలన్ని మావూరినిండా పంటకాలువలై , తాగునీటి కాలవలై మాకు నీటికరువు లేకుండా చేసాయి. బావుల్లో 4, 5 చేదలకే నీళ్ళందేవి.

ఈ పర్రెలనుండే

1. రామసముద్రం కాలువ (చాకర్ల కాలువ)
2. రెడ్డికాలువ (కుమ్మరిండ్ల దగ్గరి కాలువ)
3. పర్రెకాలువ
4. పెద్దకాలువ
5. కొత్తకాలువ
6. శాయిగూడెం కాలువ
7. మైలోని కాలువ
8. చంద్రమ్మ కాలువ
9. సోమరాజుబాయి కాలువ
10. గోనెకాలువ (ఏముకుంటలోనికి వచ్చేది)
11. మంతపురల్లరస కాలువ (లొట్లపర్రె నుండి)

ఇవిగాక మాకు వర్షపునీటిని నిలువచేసుకునే కుంటలు

1. ఏముకుంట
2. బైరకుంట
3. చింతకుంట ( పాత బీరప్ప గుడి దగ్గర)

4. పోచమ్మకుంట
5. నాగుల కుంట (?)
6. బొబ్బిలిమడుగు (బంద్రు బీరప్ప కొట్టం దగ్గర)
7. కొచ్చెరువు ( ఇప్పటి జూనియర్ కాలేజి దగ్గర) వుండేవి.

కాకతీయులు ఈ వాగునీటిని కాలువల ద్వారా పంటపొలాలకు అందించి రైతుల వ్యవసాయాభివృద్ధికి తోడ్పడ్డారు.కాకతీయుల శాసనాల్లో మూసేటికాలువ, ఆలేటికాలువ, బొమ్మకంటికాలువ, కూచినేని కాలువల ప్రస్తావన వుంది. ఆలేటివాగు నుండి తీసిన కాలువే ఆలేటి కాలువ. కొలనుపాక రెవెన్యూరికార్డులో ఆలేటికాలువ ప్రస్తావించ బడింది. క్రీ. శ. 1074 నాటి కొలనుపాక శాసనంలో అసగరస అను మాండలీకుడు సూరయ్య అనే బ్రాహ్మణునికి అరసర కాలువ ప్రక్కన కొంతభూమిని దానం చేసాడు. ఈ కాలువ మంతపురల్లరసకాలువగా పేర్కొన బడింది. ఈ కాలువే ఆలేరు నుండి మంతపురికి పోయే ఊటకాలువగా గుర్తించబడ్డది.

ఇపుడు మావూరి పర్రెలు , కాలువల ఆనవాళ్ళు కొన్నే మిగిలివున్నాయి.కొన్ని కనిపించకుండా పోయాయి.కుంటల్లో ఏముకుంట , బైరకుంటలే బతికివున్నాయి. ఏముకుంట నేమికుంటనా ?కావొచ్చు. మా అమ్మ చిన్నపుడు చెప్పిన కథ నిజమే అయితే ఈ కుంట నేమికుంట కావచ్చు.ఏముకుంట ప్రాంతంలో గిన్నెదేవర (జినదేవర లేదా జైనదేవుడు) బంగారుగుడి వుండేదట.దాన్ని సుదర్శనచక్రం వంటిది కాపాడు తుండేదట.ఒక మాంత్రికుడు(కాలాముఖ శైవులా?)ఛండాల (వామాచార, కౌలాచార)పూజలతో గుడిని అపవిత్రం చేసి బంగారం దోచుకుని గుడిని తగులపెట్టాడట. అపుడు కొందరు గుడిలోని వజ్రాలవిగ్రహాలను తీసుకుని

మాయావి మంత్రాల కందకుండా ఏరు (మంత్ర ప్రభావం ఏరు దాటదట) దాటించి దాచిపెట్టారట.

క్రీ.శ.1008,1040లలో రాజేంద్రచోళుడు, రాజరాజేంద్రచోళుడు కొలనుపాకను ధ్వంసం చేసి ,తగులబెట్టించి నట్టు చరిత్ర చెపుతున్నది.జైనదేవాలయాలను ,బసదులను కూల్చాడని తెలుస్తున్నది. దారిలోవున్న ఆలేరు కూడా ధ్వంసం చెయ్యబడి వుంటుంది. బహుశః యుద్ధంలో తగులబడినపుడు లేదా కూల్చబడినపుడు ఏముకుంట ప్రాంతంలోని గిన్నెదేవర(జినదేవుడి)గుడి మూలవిరాట్టులను కొలనుపాకకు తరలించి దాచివుంటారేమో. ఎందుకంటే ఆలేరు కూడా కొలనుపాక లేదా పంచక్రోశిపట్టణం లేదా రంభాపురి లేదా బింబావతిపట్టణం లోనిదే.(లేదా కుశస్థలి అని అభిప్రాయపడ్డారు. . . గజపతిరాయ్ వర్మ ,తాడేపల్లిగూడెం,చారిత్రకపరిశోధకుడు, 'నరసురలు' పత్రికాధిపతి,వారిది నల్లగొండ జిల్లా హుజూర్ నగర్ తాలూకా అమీనాబాద్.)

ఆ వెయ్యేండ్లకింద జరిగిన సంఘటనే కథగా మారిందేమొ. జైనదేవాలయాలను పడగొట్టించి హిందూదేవాలయాలుగా మార్చి కట్టుకొన్నవెన్నో సంఘటనలు చరిత్రలోవున్నాయి.కొలనుపాకలోని జైనదేవాలయం చెప్పుకుంటున్నట్టుగా క్రీ.శ. 4వ శతాబ్దిదేం కాదు. అట్లాంటి శాసనాధారాలేమి లభించలేదు.జినదేవరగుడిని ఎన్నోసార్లు జీర్ణోద్ధరణ చేసినట్టనిపిస్తుంది.ఆ గుడిబయట ఎన్నో జైనవిగ్రహాలు దొరికాయని గ్రామస్తులు చెప్పారు.ఆ ఆలయంగోడల్లోనే జైన శాసనస్తంభాలు లభించాయి. ఎవరుకూడా శాసనాలను అట్లా గోడల్లోపెట్టి కట్టరు.ఒక్క జైనాలయంలోనే కాదు,కొలనుపాకలోని కులమఠాల గోడల్లో, కప్పుల్లో,వీరనారాయణుని గుడికప్పులో ప్రాకారపు గోడల్లో జైన

శాసనాలెన్నో అగుపిస్తున్నాయి.అంటే జైనాలయాల్ని , బసదుల్ని కూల్చి అవేరాళ్ళను వాడుకున్నారనిపిస్తుంది.మరోకథేమిటంటే కొలనుపాకలో ఎక్కడో బంగారుపందిరి లేదా మంటపం వున్నదని తరాలనుండి వినికిడి. దీనికి ఆ బంగారుగుడి కథకు సాపత్యం వుంది.

ఒకపుడు మా వూళ్ళో మహాకాళి దేవాలయం వుండేదట. అది ఏ వరదమేటల్లో మునిగివున్నదో.ఇపుడది అలభ్యం.మావూళ్ళో మూడు ఆంజనేయుని గుళ్ళున్నాయి.ఒకటి హరిజనవాడదారిలో ఒకప్పటి పఱె (కొత్త) కాలువ ఒడ్డున వుంది. పాతగుడి ఆనవాలుగా ఒక ఆలయస్తంభం మిగిలివుంది. దాని మీది శిల్పాలు చిత్రంగా వున్నాయి. ఒకవైపు కూర్చుని చేతులు జోడించిన బొమ్మ , అభిముఖంగా మరోకవైపు నిలుచుని చేతులు జోడించిన మరొక బొమ్మ చెక్కబడివున్నాయి.రెండో హనుమంతుని విగ్రహం నడూర్లో బొడ్రాయి దగ్గర శివాలయంలో వినాయకునితో పాటు వుంది. మూడో ఆంజనేయుడి గురించి ఎవరింట్లోనో వున్నట్టు చెపుతారు కాని జాడ దొరకలేదు. మావూళ్ళోని రంగనాయకుని గుడి , 16వ శతాబ్దం నాటిదని ప్రతీతి.గుడిలో రంగనాయకుని విగ్రహశిల్పం అద్భుతకళాఖండం.





ఇంతటి విగ్రహం శ్రీరంగపట్నం తర్వాత మరెక్కడాలేదని అంటారు. ప్రతి జ్యేష్ట శుద్ధ ఏకాదశినుండి పౌర్ణిమ వరకు తీర్థం సాగేది. తర్వాత గోదాకళ్యాణం జరిగేది. గుడిమాన్యం ఆదాయంతో దేవునికి నిత్య భోగాలుండేవని అంటారు. ఇపుడా మాన్యం లేదు. ఆలయం పునరుద్ధరణ చేసినపుడు పాత ఆలయస్తంభాల్ని , విగ్రహాల్ని ఎక్కడో పారేసారు. పాతగుడిలోని అర్ధమంటపం, ఆలయం పైకప్పు పైన మా చిన్నపుడు వున్న మునుల(జైనులు?)శిల్పాలు ఇపుడు లేవు.ఇప్పుడున్న గుడిగోడల్లో చాళుక్యుల శిల్పకళాస్తంభాలు రెండు ,మూడు అగుపిస్తున్నాయి. గుడిలోపల ఒకటి ,గుడిబయట మరొకటి వీరగల్లులున్నాయి.ఒకప్పటి జైనబసదిని వైష్ణవాలయంగా మార్చివేసినట్లు చెప్తారు చారిత్రక పరిశోధకులు.అక్కడికి దగ్గరలో చండికాలయం వుంది. ఆ గుడినికూడా పునరుద్ధరణలో మార్చివేసారు.గుడిలో చండికాంబ ,శివలింగం, వినాయకుడు, సూర్యవిగ్రహాలున్నాయి. ఒకప్పుడు ఇక్కడ త్రికూటాలయం వుండేదేమో.గుడిముందర నగ్నరూపంలో మహిషాసుర మర్దని, భైరవుడు, 1అడుగు ఎత్తున్న హనుమంతుడు ,చిన్నవైన లింగాలున్నాయి.మేం చిన్ననాడుచూసిన అర్ధమంటపం ఇపుడులేదు. అక్కడికి చేరువలో బొడ్రాయి దగ్గర మరొక శివాలయం వుంది. దేవాలయంలోని శివలింగం

తెల్లనిరంగులో వుంది.గుడిఎదుటవున్న వినాయకునిశిల్పం శైలిచూస్తే చాళుక్యులనాటిదనిపిస్తున్నది.

ఒకప్పుడు వూరిలో వుండే పోచమ్మకుంటకు పడమట వున్న పోచమ్మ దేవాలయంలో మూడు దుర్గవిగ్రహాలున్నాయి. మరొక విగ్రహం శిథిలమై విరిగివుంది.గుడిబయట పోతరాజుగా పూజలందుకుంటున్న వీరగల్లు వుంది.గుడిలోవున్న మరొకశిల్పం అది జైనమునిదా లేక శైవాచార్యునిదా(ఎవరో సిద్ధునిది కావొచ్చని పి.వి.పరబ్రహ్మశాస్త్రి గారన్నారు) నిర్ధారణకు అందడం లేదు.



రైలుకట్ట వెంట మాలోల్లపోచమ్మ , కిష్టారెడ్డిచెలకలో మాదిగల(మాతంగి) పోచమ్మలున్నారు. అందులో వున్నవి  దుర్గలశిల్పాలే. రైలుకట్టకు దగ్గరలో గౌరిదేవమ్మ గుడివుంది. అది   60 ఏళ్ళ కిందటిదే నంటారు. రైలుకట్టకు అవతలివైపు రైల్వేస్టేషన్ దగ్గరలోవున్న శివాలయం రాజరాజేశ్వరునిది. 150ఏళ్ళ కింద నిర్మించబడ్డదట. రైల్వేఅధికారి తాతయ్యమాస్టరు ఈ శివాలయాన్ని నిర్మించాడట. ఆలేరులో రైల్వేస్టేషన్ కు ఎదురుగా ధర్మశాల వుండేదట. ధర్మశాలబాయి కూడా వుండేది.

మావూరిలో 33 ***అమ్మదేవతల గుళ్ళు***న్నాయి.

1. (ఊర) పోచమ్మ (పోచమ్మకుంట)



2. మాలపోచమ్మ
3. మాదిగల పోచమ్మ
4. గడిమైసమ్మ
5. పెద్దమ్మ ( పెద్దమ్మ కాలువ ఒడ్డు)
6. వనం మైసమ్మ
7. ముత్యాలమ్మ
8. గుండెలమ్మ
9. పబ్బల పోచమ్మ
10. బంగారి మైసమ్మ
11. మడి పోచమ్మ
12. మద్దిరమ్మ ( మద్దిరామమ్మ)
13. చింతకుంట్ల మైసమ్మ
14. ముక్కిడి పోచమ్మ (పాత బీరప్పగుడి దగ్గర)

15. పఱ్రె మైసమ్మ ( సోమిశెట్టి వారి పొలంలో)

16. ఉప్పల మైసమ్మ ( ముడిగెల)

17. మాతమ్మ (మాతంగిని దేవి)

18. చాకలి పోషమ్మ (పొలిచింత మైసమ్మ)

19. ఈల (నీల) గౌరమ్మ (CPM ఆఫీసు దగ్గర)

20, గుండెలమ్మ ( పసులరోగాలు మాన్పే దేవత)

21. వనంల శ్రీదేవి

22. వనం మైసమ్మ

23. వనం ఎల్లమ్మ

24. ఉప్పలమ్మ (ఉప్పలమ్మగడ్డ)

25. సరుదుల (సరిహద్దుల) మైసమ్మ ( కొలనుపాక మార్గంలో)

26. అక్కమాంకాళమ్మ

27. బుగ్గ పోచమ్మ

28. మంద మాసానమ్మ

29. గాదర్ల మైసమ్మ

30. కానుగుల మైసమ్మ (ఇక్కుర్తి పఱ్రె దగ్గర)

31. సురభమ్మ ( కాటమయ్య గుడిలో)

32. తలపఱ్రెమైసమ్మ

33. నల్ల పోషమ్మ (ఆ గుడిలో 3 అమ్మదేవతల విగ్రహాలుండేవట)



నల్లపోషమ్మ (వూరి పొలిమేరలో బంగారు మైసమ్మ కూడలిదేవత. ) ఆలేరు, రామసముద్రం, శాయిగూడెం, మందనపల్లి, బహదూర్ పేట , మంతపురి, ఇక్కుర్తి అనే 7గ్రామాల పొలిమేరల కూడలిదేవత ఈ అమ్మదేవత.

ఈ అమ్మదేవతలు కాక కాటమయ్య (శ్రీకంఠ మహేశ్వరుడు) , పోతలింగం (గుండెలమ్మ గుడి దగ్గర) , భైరవుడు(బొడ్రాయి దగ్గర) , వనభైరవుడు(?),బీరప్పలు వంటి వాళ్ళు అయ్యదేవుళ్ళు. మరో భైరవుని బొమ్మ బస్సులవంతెన దారిలో మండల కార్యాలయం వైపు ఆలేరువాగులో కుడిదిక్కున పెద్ద రాతిబండమీద తొక్కుడుబొమ్మ లెక్క చెక్కి వుంది.

ఇండ్లల్లో బాలమ్మ ,బంగారు మైసమ్మ ,ఇదుపుల మైసమ్మ , ఇంటింటి ఎల్లమ్మలు దేవతలుగా కొలువబడుతున్నారు. ఈ దేవతల పేర్లు , జాడలు చెప్పింది చాగంటి (కుమ్మరి) లింగమ్మ ,కీ.శే.మల్లెల బీరప్ప (ప్రఖ్యాత ఒగ్గు కథకుడు), మంగలి పోషయ్య.

ఈ అమ్మదేవతల సమృద్ధి ఆలేరుగ్రామంలో సమృద్ధంగావున్న పనిపాటలజనాల గురించి చెప్పకనే చెపుతున్నది.గ్రామదేవతలు ,నీటి దేవతలు,వృత్తిదేవతలు,గడిదేవతలు,సరిహద్దుదేవతలు,కూడలిదేవతలు ఆనాటి ప్రజలవిశ్వాసాలు ,ఆరాధనాపద్ధతులకు నిలిపిన రూప ధ్యానాలు.

అష్టాదశప్రజలతో గ్రామసహకారసహజీవనం , గ్రామపాలనావ్యవస్థలు ఎట్లావుండేవో చెప్పడానికి ఉపకరిస్తున్నాయి.

మావూరి బీరప్పగుడి గొల్లోనిఒర్రె ఒడ్డున వుంది. ఇందులో గొల్ల, కుర్మలు పూజించే లింగాలలో కొన్ని ఆదిమానవుల రాతిపనిముట్లు. ఎక్కువగా రాతిగొడ్డండ్లు వున్నాయి.ఈ ప్రాంతంలో దాదాపు అన్ని బీరప్పగుళ్ళలో నవీనశిలాయుగానికి చెందిన ఆదిమానవుల రాతి పనిముట్లు లింగాలుగా పూజలందుకుంటున్నాయి.ఇవికాక శిథిలాలయాల ఆనవాళ్ళు చాలానే వున్నాయి.

ఇప్పటి పోలీస్ స్టేషన్ కు దగ్గరగా పురాతనకాలం నాటి మసీదుంది. మసీదుకు 150 యేళ్ళ వయసు. ఎదురుగా దర్గా వుంది. అది సయ్యద్ ఇస్మాయిల్ షా ఖాద్రి సమాధిగా ప్రసిద్ధం. ఖాద్రి బాగ్దాద్ కు చెందిన అఫ్జల్ బియాబాని మనవడు .హైదరాబాద్ లో పెళ్ళిచేసుకుని ఖాజీపేటకు వెళ్తున్నపుడు కలరావ్యాధిబారిన పడి వంగపల్లిప్రాంతంలో అంతిమ ఘడియల్లో వున్నపుడు ఆలేరుకు చేర్చేసరికి మరణించాడని , ఆయన స్మృత్యర్థం నిర్మించినదే ఆలేరుదర్గా అనిచెప్తారు. ఇది 200ల యేళ్ళ కిందిది. ఇక్కడి మతపెద్దల కలలోకనిపించి ఖాద్రి ఆదేశించినవిధంగా ప్రతిసంవత్సరం రజ్జబ్ 2వ తేదీన ఉర్సు చేస్తుంటారు. వందేళ్ళకిందటి నుండి శేషగిరిరావు , వెంకటరావుగారలు ప్రతి సంవత్సరం ఉర్సుకొరకు బస్తాబియ్యం ఇస్తుండేవారు. ఈ దర్గాకు ఖాదింలుగా (ఖిద్మత్ దార్. . ముతావలి) సయ్యద్ మహమూద్ అలీ. సయ్యద్ బిక్కం సాహెబ్ (హసన్ అలి అన్న కొడుకు), సయ్యదలీ, మహమూద్ అలీలు వున్నారు.

తాటివనానికివెళ్ళే రామసముద్రంతొవ్వలో కాటమయ్యగుడి వుంది. అందులో సురమాంబాదేవి వుంది. అక్కడే వున్న రైస్ మిల్లు గోడకు దగ్గరగా ఒక బావి (కోనేరు)వుండేది. పూడ్చేసారు. దానికిపైన కొద్ది

దూరంలో భూదేవమ్మగుడి వుండేదట. రైసుమిల్లులోని బావిలో మట్టిఒరలు బయటపడ్డాయని మానాన్నవాళ్ళు చెప్తుండేవారు. ఆ మిల్లుకిందకు పోయినవి తుంగచంద్రమ్మపర్రె, పర్రెకాలువలు. మట్టిఒరలు ఈప్రాంతంలో కొలనుపాకకు తూర్పున , షారాజిపేట అడ్లూరి చెరువులో, మావూరి రైసుమిల్లులో లభించాయని జనం ఉవాచ.

***ఆలేరు మధిర సోమరాజుబాయిః***ఆలేరువాగుకు తూర్పు ఒడ్డున సాయిగూడెం దగ్గరగా సోమరాజుబాయి అనే చిన్నపల్లె వుంది. అక్కడ వూరికి పడమట చిన్నదిబ్బమీద నాగవిగ్రహాలు , జైనమునివిగ్రహం, పాదాలున్నాయి. అక్కడికి దగ్గరలో పూర్తిగాచెక్కని సూర్యవిగ్రహముంది. దేవాలయ శిథిలాలున్నాయి. నాగలికి తగిలినపుడల్లా దొరికిన విగ్రహాలను తీసి అక్కడి పెద్దబాయిలో వేసారట.



***ముడిగెలః*** మావూరికి ఉత్తరాన కొలనుపాకదారిలో పెద్దవాగు ఒడ్డున 'ముడిగెల'(మునికెరె అంటే మునులచెరువు?)అనే పేరున్న ప్రదేశం వుంది. AP Archeology A Review-1987-2001లోని 1990-91 ephigraphical survey నివేదికలో కొలనుపాకలోని జైనదేవాలయస్తంభంమీద లభించినశాసనంలో బలాత్కారగణ ముఖ్యుడు మహదేవచంద్రభట్టరు సమక్షంలో 'ముదుగునూరు' జైనబసదికి

మహాప్రధాని,దండనాయకుడు మాయిదేవుడు భూదానంచేసినట్లు పేర్కొనబడ్డది. ఈ ప్రాంతంలో ముదుగునూరువంటి పేరుగల వూర్లు లేవు. కనుక ముడిగెలే ముదుగునూరు అయివుండవచ్చు.ముడిగెలలో ఆలేరువాగు ఒడ్డున కలశంచెక్కిన దేవాలయం శేరడు (ద్వారబంధస్తంభం),చాలా అరుదుగావుండే బెల్లంబొంద లేదా కోనేరు అని పిలువబడే కనీలతోకట్టిన చతురస్రాకారపుబావి వుంది. సర్వాలంకారశోభితమైన మహిషాసురమర్దిని ,వినాయకుని విగ్రహాలున్నాయి.




అక్కడికి దగ్గరలో ఆంజనేయునివిగ్రహం వుంది.ఆ పొలాల్లో ఎన్నోశిల్పాలు దొరికాయట.పొలంపనులకు అడ్డంగా వున్నాయని విగ్రహాలను ఆ బావిలో పడేసినట్లు స్థానికరైతులు చెప్పారు.వాగునుండి ఇసుకతోడుకపోయిన వ్యాపారులే నాగవిగ్రహాలు ,ఆసనస్థితిలో వున్నస్త్రీమూర్తి విగ్రహంవంటి ఎన్నోశిల్పాలను తరలించారని అక్కడి పొలాలరైతులు చెప్పగా విన్నాం. ఒకేఒక చేతులువిరిగిన విష్ణుమూర్తివిగ్రహాన్ని తీసుకెళ్ళి ఏముకుంటలో తమపొలంలో నిలుపుకున్నారు కీ.శే.బొట్లనర్సయ్యగారు.వీటన్నిటిని క్రోడీకరిస్తే ఈప్రాంతంలో జైనబసదివుండేదని తెలుస్తున్నది.అందువల్ల శాసనంలో పేర్కొనబడ్డ ముదుగునూరే ‘ముడిగెల’అవుతుంది.

## *ఆలేటి కంపణం– కొన్ని చారిత్రక గ్రామాలుః*

ఆలేరు కంపణం–40లోని ఆయాగ్రామాల గురించి గ్రామస్తులుచెప్పిన కైఫీయతులు ,అచ్చయిన శాసనాలు ,చరిత్రగ్రంథాలు, చారిత్రకపరిశోధకుల పరిశీలనలు ,క్షేత్రపర్యటనలు ఆధారం చేసుకుని ఆలోచిస్తే,ఆలేరుకంపణంలోని గ్రామాలు ,పట్టణాలలోని వాగులు , వంకలు, రాతిబోళ్ళు, గుట్టలు ఒకప్పటి ప్రాచీనమానవునిఆవాసాలని , ఈ ప్రాంతంలో మధ్యశిలాయుగాలకాలంనుండి మానవనాగరికతా , సంస్కృతులు వెల్లివిరిసాయని తెలుస్తున్నది.

ఇక్కడి గుట్టల్లోనిగుహలు ,అక్కడ లభించిన రాతిపనిముట్లు , పూసలు,కుండపెంకులు వివిధయుగాల్లో మానవపరిణతిని చాటుతున్నాయి.బృహచ్ఛిలాయుగం,ఇనుపయుగంసమాధుల్లో సిస్తులు , కైరన్లు, డోల్మన్లు, కుప్పరాతిసమాధులు, మెన్హర్లు ఈ ప్రాంతంలో ప్రత్యేకం. పచ్చిమట్టికుండపెంకులు,బూడిద,ఎరుపు,నలుపు రంగులలో వున్న నున్నని,పలుచని,మందపాటి కాల్చినకుండపెంకులు ఆదిమానవుల ఆవాసాల్లో,పాటిగడ్డల్లో విరివిగా దొరికాయి.గుట్టలపై , పరుపుబండలమీద ఆదిమానవులు తమ పనిముట్లను నూరుకున్న రాతిబొద్దులనేకం. ఇవిగాక వారు వేటకొరకు ,నాట్లు నాటుకునేందుకు ,ఆరాధనాస్థలాల్లో నీటిని నింపుకునే పాత్రలుగా ,వేటాడిన జంతువుల ఆకారాల నమూనాలతో , నక్షత్రాలదారిని తెలిపేందుకు ,ఆటలకొరకు తొలిచిన రాతిగుంటలు (Cupules)వారి ఆవాసాలలో ,తిరుగాడిన ప్రదేశాలలో బండలపై , సమాధులబండలపై అనేకంగా కనపడుతున్నాయి.

అనేకగ్రామాలకు పాటిగడ్డలున్నాయి.ఈ పాటిగడ్డలన్నీ ప్రాచీనగ్రామాలే.ఈ చోట్లలో నివాసాల ఆధారాలు ,ఇటుకలకట్టడాలు, మట్టిగోడలు,పూసలు,రాతిపనిముట్లు,ఇనుపవస్తువులు,

రోళ్ళులభిస్తున్నాయి.శాతవాహనులకాలంనాటి ఇటుకలు ,
విష్ణుకుండినులనాటివి,ప్రత్యేకంగా కాకతీయులనాటి ఇటుకలు ఈ
ప్రాంతంలో లభిస్తున్నాయి.గుళ్ళు ,గోపురాలు ద్రావిడ ,ఉత్తరాది (నాగర ,
బేసర) శైలులతో అపురూపంగా నిర్మించబడ్డాయి. క్రీ. శ. 2డో శతాబ్దం
నుండి లభించిన వివిధ దేవతామూర్తుల శిల్పాలతో ,వీరగల్లులతో,
తోరణద్వారాలతో, కోనేరులతో నిండి వున్నాయి యిక్కడి గ్రామాలు. ఏ
చిన్నగ్రామంలో చూసినా ఏదో ఒకప్రత్యేకత వుంది.చరిత్ర వుంది.
ఆలేరువాగు వెంట చరిత్ర ప్రవహించింది.నీరు మానవసంస్కృతీ ,
నాగరికతలకు ప్రాణం పోస్తుందికదా.

ఆలేరు నదీతీరాన పుట్టిన నాకు ఇక్కడి చరిత్రపుటలు
చదివేఅవకాశం దొరికినందుకు సంతృప్తిగా వుంది.నన్నీ దిశలో
నడిపించిన వారికి, ముఖ్యంగా విరువంటి గోపాలకృష్ణ గారికి కృతజ్ఞతలు.

ఆలేటికంపణంలో అన్నిరకాల ఉద్యోగ,సేవావృత్తుల్లో వున్న
వారికి వారికులాల,ఉద్యోగాలపేరన గ్రామాలనేర్పాటు చేసినట్లు
తెలుస్తున్నది.ఆలేరునది ఒడ్డున సాయి(సాహిణి-అశ్వసైనికుల)గూడెం
(గుడారం),దానిపక్కన మందనపల్లి(మందడి-అశ్వదళం నిర్వాహకుల
గ్రామం),మరొకపక్కబంటు(కాల్బలం)గూడెం(ప్రస్తుతపుపేరు
శ్రీనివాసపురం),యాసోజుగూడెం(వడ్ల,కమ్మరులగ్రామం),కాచారం,
కమఠంగూడెం(ఇనుముకాచేవారి వూర్లు),ఆలేరుకు 3కి.మీ.ల
దూరంలోవున్న పాటిగడ్డ 'గొల్లగూడెం',అదే క్రమంలో కొల్లూరు గొల్లూరు
కావచ్చు,ఇక్కుర్తి(ఈ కురి+కి, కురి అంటే గొర్రె అని కన్నడంలో అర్థం.ఆ
అర్థంలో కురుబ లేదా కురుమల గ్రామం), బ్రాహ్మణపల్లి(బ్రాహ్మణుల
అగ్రహారం)మొదలైన గ్రామాలు అటువంటివే కావాలి.మరికొన్ని
కులవృత్తుల గ్రామాలను అన్వేషించవలసివుంది.

గౌరాయపల్లి(గౌరాంగుడు జైనమహావీరుడు),మాణిక్యపురం (మాణిక్య ప్రభుపురం),సిద్ధెంకి(జైనసిద్ధుల వూరు),జనగామ(జైనుల ఆరామం), సాధుపల్లి(జైన లేదా బౌద్ధసాధువుల పల్లె),పెంబర్తి(పెనుపర్తి), నెమిల(నేమినాథునిపేరు మీద వూరు) వంటివి మతపరమైన గ్రామాలు,

సోమారం(సోమవరం,కళ్యాణిచాళుక్యచక్రవర్తి,రాజరక్షకుడు సోమయ నాయకుని పేరుమీద వూరు),రాజపేట(రాజారాయన్న పేరుమీద పట్టణం),సుద్దాల(సోద్దాలయ్య పేరుమీద వూరు),శర్బనాపురం (శర్బనయ్య పేరుమీద వూరు),మాటూరు(మాటూరువంశస్తుల పేరుమీది వూరు)చాడ(చిడెయవంశ రాజుల పేరుమీద వూరు),రాయగిరి (రాజగిరీయ బౌద్ధశాఖీయుల వూరు),చొల్లేరు(చోళుల వూరు), చల్లూరు(చాళుక్యులవూరు)వంటి రాజ మరియు రాజవంశనామగ్రామాలు,

పాముకుంట(శాసనాలలో పానుపురి లేదా పాకుగూటు అని పేర్కొన్నది ఈవూరే కావచ్చు),గోష్టీపాళు(గొల్లగూడెం కావచ్చు), ముడిగెలశాసనంలో ముడిగెనూరు) వంటి శాసనగ్రామాలు,

సైదాపురం(సైదా అంటే నాగలి.), గుండ్లగూడెం రాతిగుండ్లవూరు,రాయికుంట,మేడికుంట,వంగపల్లి,టంగుటూరు (తుంగటూరు లేదా తంగేటూరు)వంటి ప్రాకృతికనామాలున్న వూర్లు

ఈదులవాగు(కాదు ఏదులవాగు),రత్నాలవాగు(కాదు,రాటనాల వాగు),గోదారువాగు(అమ్మనబోలు అవతలపారేవాగు,ఆలేటి వాగులో కలిసే గోదావరి వాగు?) వంటి వాగులు ఆలేరుకంపణం ప్రత్యేకత.

### *కొలనుపాక:*

కొలనుపాక కళ్యాణీచాళుక్యుల సామ్రాజ్యానికి(ఉప)రాజధాని.ఆలేరుకు రాజధాని,మహామండలం,కొలనుపాక చారిత్రకప్రదేశం.ప్రకటించిన శతాధికశాసనాలేకాక అపరిష్కృతశాసనాలెన్నో వున్నాయి.కొన్ని కొత్తగా బయటపడుతున్నవి.ఈ పంచక్రోశిపట్టణంలో ఎక్కడతవ్వినా దేవాలయ శిథిలాలో,పురాతనభవనాల ఆనవాళ్ళో ,శాసనాలో బయటపడ్తూనే వున్నాయి.సోమేశ్వరాలయం,రేణుకాపీఠం,అష్టాదశ(కాదు22)కుల మఠాలు,వీరనారాయణదేవాలయం,హనుమంతునిగుళ్ళు,అమ్మదేవతల గుళ్ళు,వీరగల్లులు,ఆర్కియాలజిమ్యూజియం,జినదేవరగుడి,ఎన్నెన్నో గుళ్ళు,గోపురాలతో,చారిత్రకసంపదలతో విలసిల్లే వైభవనగరం కొలనుపాక.(చదవండి: కొలనుపాక చరిత్ర– విరువంటి గోపాలకృష్ణ)

వందేండ్ల కింద కొలనుపాక:

1915నాటి మాట. నవాబ్ బహిరాముద్దౌలా బహదూర్ వారి (3వ నిజాం సికిందరుజా నవాబ్ మీర్ జైన్లావుద్దీన్ ఖాన్ సత్వత్ జంగ్ బహరాముద్దౌలా బహిరాముల్ ముల్క్ కు ఇచ్చిన $_1$) జాగీరులోనిగ్రామం కుల్పాక్ (కొలనుపాక). NGS(Nijam Guaranteed Services) రైల్వేస్టేషన్ ఆలేరుకు ఈశాన్యంగా 4మైళ్ళ దూరంలో ,హైద్రాబాదుకు ఈశాన్యంగా 45మైళ్ళదూరంలో వుంది కుల్పాక్.లెక్కలేనన్ని పురావస్తు అవశేషాలు,శాసనాలతో నిండిన ఈవూరు ఒకప్పుడు గొప్ప మతకేంద్రం. దక్కన్ రాజకీయ,మతచరిత్రలో కీలకమైన పాత్ర పోషించిన దీవూరు. కుల్పాకను శాసనాల్లో కొల్లిపాక అనే పేరుతో సంబోధించారు. ఈ వూరికనేకం పేర్లున్నయి. అందులో 'బింబావతిపురి , వ్యాకృనగరం, సరోవరకుటీరం,సోమశేఖరపురం,కుదుటపురి,కొలుతపురం'అనేవి కొన్ని. కాని ప్రసిద్ధమైంది కొలనుపాక అన్నపేరే.(ఈ గ్రామానికి'కొల్లిపాక ,

కొట్టియపాక,కొల్లియపాక,కొల్లిహాకే,బింబావతిపురం,కుదుటనగరం,సరోవర కుటీరం,సోమశేఖరపురం,కుళుదపురం,కుల్పాక్'అనే పేర్లున్నాయి $_2$). ఈగ్రామంలో పెద్దసంఖ్యలో దేవాలయశిథిలాలు , చెక్కిన రాతిస్తంభాలు , విగ్రహాలు, బొమ్మలు, సాలంకాలు, నందులు, లింగాలు, సప్తమాతృకలు మొ.దొరికినయి.రెండుపాతదేవాలయాలు 1.సోమేశ్వరునిగుడి ,2.వీరనారాయణగుడి.ఇప్పటికీ పూజాదికాలు నడుస్తున్నగుళ్ళు.ఒకటి శివునికి , రెండోది విష్ణువుకు అంకితమైన గుళ్ళు. ఇంకా అక్కడ 22 చిన్నగుడులు మఠాలుగా పిలువబడేవి వున్నాయి. ఇవన్నీ శిథిల(జైన) దేవాలయాల రాళ్ళు, శిల్పాలతో కట్టినవే.(ఇపుడు కనిపిస్తున్న ఈ కులమఠాలు కొన్ని తప్ప మిగతావి చాలావరకు శిథిలమైపోయాయి. గౌడ , గాండ్ల, గొల్ల, చాకలి,మాల,మాదిగ,విశ్వబ్రాహ్మణమఠాలు కొన్నిబాగున్నాయి.అన్ని మఠాలలో జైనశాసనాలు,జైనశిల్పాలు అగుపిస్తున్నాయి -రచయిత)

సోమేశ్వరునిగుడి లేదా మహదేవునిగుడి వూరికి వాయవ్యాన వుంది.గుడికి ఏకైక పెద్దద్వారం తూర్పునవుంది. గుడికి ముందర బహిరంగప్రాంగణం వుంది. మధ్యలో 26అ. ల ఎత్తున్న ఏకశిలాస్తంభం , దానిపైన చిన్ననందిమంటపం వుంది. ప్రాంగణానికి ఉత్తర , దక్షిణాలుగా స్తంభాలతో రెండువరండాలున్నయి.(ఇప్పుడది మ్యూజియంగా మార్చబడింది.కొన్నిలింగాలు,కొన్ని సాలంకాలున్నాయి.ఉత్తరవరండాలో వికసిత పద్మం మీద పైకెత్తిన మడిమలమీద కూర్చున్న (వజ్రాసనంలో) సాంకేతికంగా పూర్ణధ్యానస్థితిలోవున్న స్త్రీదేవతా శిల్పముంది. దేవతకు 4భుజాలున్నయి. ఈ బొమ్మ మెడవద్ద విరిగిపోయివుంది. ఈ విగ్రహాన్ని నిలిపిన అధిష్టానపీఠం ముందరివైపు 4 సూక్ష్మస్తంభాలున్నయి. మధ్యలోనున్న స్తంభాలు ప్రత్యేకం. వాటిమధ్య ఆకులతో ఒక చక్రంవుంది. దానికిరువైపుల జింకలు లేదా దుప్పులు వాటికి ప్రతివైపు ఒక్కొక సింహం

చెక్కివున్నాయి.ఈ అధిష్టానపీఠం 3 ఆ విగ్రహానిది కావచ్చు కాక పోవచ్చు.చక్రం హిందువులకు, జైనులకు, బౌద్ధులకు పవిత్రచిహ్నామే. ఈ చక్రం స్వస్తికనుండి వచ్చిందని పండితులభావన.ఇది ప్రపంచపు పురాతనచిహ్నం.బౌద్ధులు, జైనులు ఈ చక్రాన్ని ధర్మచక్రమంటే , హిందువులు జీవితచక్రమన్నారు.ఇది విష్ణువు ఆయుధంగా అందరికి తెలుసు. ఈ సింహచిహ్నం శాంతినాథునిది. ఆయన 16వ తీర్థంకరుడు. దానికి జింకలు చేర్చడంవల్ల అది వర్ధమాన మహావీరునిది కావచ్చు. ఆ దేవత ధర్మం లేదా న్యాయానికి ప్రతినిధి. దేవతాశిల్పానికి నాలుగుచేతులు, వాటిలో సీసా (పాత్ర), త్రిశూలం, పాశం వున్నట్టు తెలుస్తున్నది. విగ్రహం బాగా చితికిపోయివుంది.

సోమేశ్వరుని గుడిముందరి ప్రాంగణంలోని దక్షిణపు వరండాలో భూమినుండి 4అ.ల ఎత్తునవున్న 10అ.ల పొడవున మనుషులబొమ్మలు, జంతువులు, హంసలు, వృక్షాలున్న రాతిస్తంభాలు పాతగుడి వనిపిస్తాయి. పడమట దేవాలయ పూర్వమంటపముంది. దీంట్లో 24 స్తంభాలున్నాయి. గుడిలోనికి దారితీసే ద్వారం చక్కనిశిల్పంతో అందంగా వుంది. గుడికి , ప్రాంగణానికి మధ్యవున్న ఖాళీలో 26అ. ల ఎత్తయిన రెండు ఏకశిలాస్తంభాల్లో ఒకటి పడిపోయివుంది. సోమేశ్వరుని గుడికి పునాదిలేదు. గుడిచుట్టు రెండడుగుల ఎత్తు బొద్దుకట్టివుంది. ప్రధానదేవాలయమే దయనీయస్థితిలో వుంది.కప్పునిండా పిచ్చిచెట్లు పెరిగి వున్నయి.లోపలంతా చీకటి.నేలకు పరిచినబండలు లేచిపోయి వున్నయి. నడిస్తే తట్టి ,పడిపోయేటట్టున్నయి.లోపల నందిమంటపం.గుడికి హక్కుదారునని చెప్పుకునే ఒకావిడ గబ్బిలాలతో పోటిపడుతు అక్కడ దీపం పెడుతున్నది. చీకట్లో నడిచి , కొన్ని మెట్లెక్కిదిగి అందంగా చెక్కిన ద్వారబంధంనుండి సోమేశ్వరుని గర్భగుడిలోపలికి వెళ్ళవచ్చు. చాలా

చిన్నగర్భగుడి. 6చ. అ. ల వైశాల్యం. లింగం కూడా గుర్తించలేనంత ఎత్తు తక్కువగా వుంది. దీన్నే 'స్వయంభు'లింగం అంటారు. ఈ గర్భాలయానికి పక్కన దక్షిణంగా వున్న చిన్నగుడిలో చక్కనిశిల్పం చండిక దేవతది.

ఈ గుళ్ళకు దక్షిణంవైపు 2 ,3డో శిథిలదేవాలయాలున్నయి. ఇందులో ఒకటి చెక్కిన ద్వారస్తంభాలతో చాళుక్య శిల్పంతో కిటికీలు , జాలీలు కలిగివుంది. ప్రధానదేవాలయానికి నైరుతిలోని చిన్నగుడిలో 'కోటిలింగం'గా పిలువబడే 16.5అం.ఎత్తు ,47అం.ల కైవారంతో శివలింగముంది.లింగానికి నాగుబాముచుట్టినట్లు చెక్కబడివుంది. లింగంపై గొలుసులెక్క (20 ★50=1000)సూక్ష్మలింగాలు చెక్కబడ్డవి. సోమేశ్వరునిగుడి చుట్టు వినాయకుడు, సప్తమాతలు, ఇతరశిథిలాలు కాక భూమిలోంచి బయటకుకన్పడే చిన్న ఏనుగుమీద స్వారిచేస్తున్న మనిషి బొమ్మవిరిగివుంది.ఇది బహుశః అష్టదిక్పాలకుల్లో ఒకడైన ఇంద్రుని శిల్పమేమో.

సోమేశ్వరునిగుడి బయట ఉత్తరాన ప్రతాపరుద్రునిగుడి వుంది. ఇంకా అందులో 11 స్తంభాలు నిలిచివున్నాయి. అంతరాళం , శివలింగం వున్న గర్భాలయం ,ద్వారబంధాలకు ద్వారపాలకులు ఢమరుకం , త్రిశూలం,గద ధరించివున్నారు.పైన లలాటబింబంగా గజలక్ష్మి చెక్కబడింది. గుడి నిర్మాణం నక్షత్రాకారంలో వుంది. ఈ గుడికి ఉత్తరాన నక్షత్రాకారపు పునాదిపై కొత్తగా కట్టిన మరొకగుడి అవశేషాలున్నయి. అక్కడున్న వాటిలో రెండుస్తంభాలు ప్రత్యేకం, ఇంకొన్ని నల్లరాతిలో చెక్కిన బ్రాకెట్లు, ఇతరస్తంభాలు 5, 6రో వున్నయి. ఆ రెండు స్తంభాల్లో ఒకదానిపై మనుషులశిల్పాలు, సూక్ష్మశిఖరాలు, నృత్యలావికలు, వాద్యగాళ్ళు, హంసలు చెక్కివున్నయి. మరోస్తంభంపై అష్టదిక్పాలకులు వాహనాలతో శిల్పించబడ్డారు. సూపరింటెండెంట్ యాజ్దాని గారి అభిప్రాయం ప్రకారం

ఇవి వరంగల్, హన్మకొండ,ఆనెగొంది విజయనగర దేవాలయస్తంభాలతో పోలివున్నాయి. సోమేశ్వరునిగుడికి పడమట పెద్దచెరువు , దాని మధ్యలో కృత్రిమమైన దిబ్బ 25అ. ల ఎత్తైన స్తంభం 4భాగాలుగా వుంది. అడుగున చదరపుపలకలు, పైన అష్టభుజాలు, మూడవ వరుస 16భుజాలు, ఆ పైన గుండ్రంగా వలయాలు చెక్కి వున్నాయి. చదరపుపలకలపై శాసనం వుంది. దీన్ని 'సోమదేవ కీర్తిస్తంభం' అంటారు.దానికి 4గజాల దూరంలో పడమట కొన్ని నిర్మాణావశేషాలు పడివున్నాయి. ఇదే తర్వాతకాలంలో 'అంబరకులతిలకబసది'గా గుర్తించ బడింది. ఆ శాసనంలోని వివరాల వల్ల అది అక్కబసదని తెలిసింది. దీన్నే ఊబగడ్డగా పిలుస్తారు.

ఈ దిబ్బకు ఈశాన్యాన ఒక ఫర్లాంగుదూరంలో 18అ. ల ఎత్తైన ద్వారంవుంది.(దానికి రాజదర్వాజ అని పేరున్నది , దాన్ని మనం కొలనుపాకతోరణం అని పిలుచుకుందాం.) అదొక చిన్నదిబ్బమీద వుంది. కొన్ని చెక్కిన కప్పుబండలున్నాయి.ఈ ద్వారబంధపు రెండుస్తంభాలపై దక్షిణం,పడమర,ఉత్తరందిశల్లో మానవరూపాలు చెక్కివున్నాయి. తూర్పున ఏంలేవు.పశ్చిమాభిముఖంగా ద్వారపాలకులు చెక్కబడ్డారు. పై స్తంభానికి 8 చిన్న ఆర్చులు,7డ్రాప్స్ వున్నాయి.వాటిక్రిందుగా రెండువైపుల బ్రాకెట్లు వుండేవన్నట్లుగా రాతితొలులు వున్నాయి.కొందరు ఈ ద్వారాలను కీర్తిస్తంభాలన్నారు.ఇవి బౌద్ధనిర్మాణాల్లో భాగంగా రూపొందించి వుంటారు. కాని, అట్లాంటి ఆధారాలేమీ దొరకలేదు. అదే దిబ్బపై 2పెద్ద రాళ్ళు 64 అం.ఎత్తున్నవి.వీటిపై కుడికాలే రెండింట్లో వుంది. 3వది ఎడమకాలు పైకెత్తివుంది.మొదటి రెండుకాళ్ళు మడిమలవద్ద విరిగి వున్నాయి.ఇవి కూర్చున్నశిల్పాలు కావచ్చన్నారు సూపరింటెండెంట్ గారు. హంపిలోని నరసింహుని వంటివే ఇవి కావచ్చు.అక్కడొక శిథిలవిగ్రహశకలం పడివుంది.వికసితపద్మంపై కాళ్ళుముడుచుకుని

కూర్చున్నట్టుగా వుంది శకలంపై శిల్పం. తలకిందులున్న ఈ రాతిముక్క ఒకవృక్షకాండం దానికింద ధ్యానంలో కూచున్నట్టు వుంది. ఇది బౌద్ధందో, జైనందో కావచ్చు.

ఈ దర్వాజకు ఆగ్నేయంగా ఫర్లాంగు దూరంలో పూర్వాభిముఖంగా జైనదేవాలయం. మూడు ప్రధాన దేవుళ్ళున్న గదులు , వాటిపై శిఖరాలు. ప్రధానదైవం రుషభదేవుడు లేదా ఆదినాథుడు. మిగతా రెండు మహావీర(లేత ఆకుపచ్చరాయిలో) ,నేమినాథులవి.ఈ పునరుద్ధరణలో గుడిచుట్టు తవ్వినపుడు ఎన్నోశిల్పాలు బయటపడ్డాయి. కొన్ని శిథిలమైనవి.కొన్ని పూర్తిగా బాగున్నవి.వీటిలో ప్రధానం 9. కాయోత్సర్గభంగిమలో 3 ,ఆసనస్థితిలో ధ్యానభంగిమలో 6వున్నాయి. 3అడుగుల నుండి 5న్నర అడుగుల ఎత్తున్న నల్లరాతి నునుపైన శిల్పాలు. ఏకరీతి శిల్పాలు.మహావీరుని విగ్రహానికి మిగతా 23 తీర్థంకరులను చెక్కారు. అక్కడి చలువరాయిబొమ్మల్లో వరహావతారం వుంది.

జైనదేవాలయానికి ఎదురుగా సికింద్రాబాద్ సేఠ్ పూనంచంద్ గారి తోటవుంది.అందులో 6అ. ల ఎత్తున్న లింగం,అంతకు రెండడుగులు తగ్గిన గిర్త్.దీని పునాది 6పొరల పాతఇటుకలు ,డంగుసున్నంతో కట్టివుంది.దక్షిణంలో పాతబావివుంది.మూడెత్తుల మెట్లు.ఈ లింగం కొలనుపాకలోనే ఎత్తైంది. దాని గుడికి చెందిందే ఈబావి. పునరుద్ధరణలో 60 చెక్కినస్తంభాలు ,చెక్కిన పెద్దరాళ్ళు వేలు ,ఒక పెద్దమొత్తంలో పాతఇటుకలు వీటితోనే ఎదురుగా బంగ్లాగోడలు కట్టబడ్డాయి.

ఈ ఇటుకల పోలికలుః

మౌర్యులకాలం (320–180 క్రీ. పూ. ) : 21న్నర. 14న్నర. 3పావు అంగుళాలు

కుషానులకాలం (2–1 క్రీ. పూ. ) :14. 10. 2 ''

గుప్తుల కాలం (320-535 క్రీ. శ. ) :17. 12. 3న్నర ''

కొలనుపాక వి (?) :15న్నర. 8న్నర. 2 ''

కొన్ని శాసనాలరాళ్ళు చిన్న చిన్నవిగ్రహాలు కొత్తగా కట్టిన జైనదేవాలయపు గోడల్లో వున్నాయి.బయటిగోడల్లో ద్వారస్తంభ శిల్పాలున్నాయి.

గ్రామంలో ఆంజనేయునిగుడి దగ్గర ఒక శాసనస్తంభం , గుడి వెనక కాంపౌండులో విష్ణువు, ప్రభపై దశావతారాల శిల్పాలు, మకరాలు. ద్వారపాలకశిల్పాలు, గరుడుడు, విరిగినదండ. . . అందమైన శిల్పం.

ఈగుడికి నైరుతిలో విష్ణువుకంకితమైన(వీరనారాయణ) గుడి.అన్నిగుళ్ళు తూర్పుముఖంగా వుంటాయి. ఈ గుడి ఉత్తరాభిముఖంగా వున్నది. ధ్వజస్తంభానికి 3వైపుల శాసనం వుంది. అంతరమంటపంలో రెండు రాతిపలకలపై కన్నడ, సంస్కృతంలో శాసనాలున్నాయి. మంటపం కవతల 3గదులు , వాటిలో ఒకదానిలో పచ్చళ్ళు , రెండో దానిలో పొయ్యిలకట్టెలు, మూడోదానిలో చెత్తంతా వేసివుంది. ఆ కట్టెలకింద విష్ణువు విగ్రహం వుంది. దానిపై కూడా దశావతారాలు చెక్కివున్నాయి. మంటపపు కప్పుకు వాడినవన్నీ ఇతర ఆలయాలవి. ఈ మంటపమే తర్వాత చేర్చికట్టబడింది.(ఈ గుడిలోని గర్భగుడిలోవున్న ఆళ్వార్ల విగ్రహాలలో 5అంగుళాల ఎత్తున్న జైనమహావీరుని కాంస్యవిగ్రహం వుంది. అది కూడ ఈ గుడి జైనులగుడినుండి వీరనారాయణునిగుడిగా పరివర్తన చేయబడ్డదని చెప్పడానికి గొప్పసాక్ష్యం-రచయిత)

ఊరికి పడమట అంచున కొన్ని శిథిలశిల్పాలున్నాయి. అందులో ఒకటి పార్వతీపరమేశ్వరులది.శివునితొడపై కూర్చున్న దేవి. అధిష్టానపీఠంపై గంధర్వులు. ఒకరి ఇంట్లో రెండుచేతుల విష్ణువు.

కుడిచేత బాణం, ఎడంచేత విల్లు. శిల్పం కోదండరామునిది. శిల్పఫలకంపై కుడివైపున శంఖువు, ఎడంవైపున చక్రం చెక్కివున్నాయి.

ఇక్కడ దొరికిన అవశేషాలు 20గుళ్ళకు సరిపోయేవి. కుల్పాకలో ఎన్నోగుళ్ళు.

కుల్పాకశాసనాలు 45దాకా వెలుగులోకొచ్చాయి.40 అచ్చుతీసారు.4తరాల చాళుక్యుల కాలాలకు చెందిన శాసనాలు ఎక్కువగా వున్నాయి.చాళుక్యులకు కొలనుపాక-7000 (గ్రామాలు) రాజధానిగా కొంతకాలం, మరికొంతకాలం ప్రాంతీయ పాలనాకేంద్రంగా, ముఖ్యపట్టణంగా వుంది. కొన్ని శతాబ్దాల అనంతరం 18వ శ. మొదట్లో షా ఆలం రెండోపాలనా సం.లో ఒక పరగణా పట్టణంగా వుంది కుల్పాక. పాపరాయుడు(సర్వాయి పాపన్న?)( Free booter) కుల్పాకను ఆక్రమించాడు.రాజసైన్యాలు కుల్పాకను విడిపించాయి.( Elliot's History of India)

కుల్పాక గురించి ఎన్నో ప్రశ్నలు మిగిలివున్నాయి.

1. ఆ రెండు సుందరస్తంభాల వంటివి ఇంకా వున్నాయా?
2. ఆ దర్వాజ దేనికి ప్రతినిధి? దానికి తోడు వరంగల్ లాగా ఇంకా ద్వారాలున్నాయా?లేక గుడి ముందరి ద్వారమా , అయితే గుడి ఎక్కడ?
3. మూడు పాదాలు ఏం చెపుతున్నాయి?

(The Journal of the Hyderabad Archeological Society-1917 "The Antiquities of Kulpak" by T. Srinivas (read on 24 November 1915) గారి వ్యాసం నుండి విషయసంగ్రహణం)

References:

1. విరువంటి గోపాలకృష్ణ –'కొలనుపాక చరిత్ర–శాసనాలు'అనే మోనోగ్రాఫ్ (1998)
2. Ibid
3. 'తెలంగాణలో బౌద్ధం' (2012) (పేజి సం. 14) రాసిన ఈమని శివనాగిరెడ్డిగారు ఆ అధిష్టానపీఠం గురించి 'నల్లగొండ జిల్లా కొలనుపాకలో నలశానపు విగ్రహపీఠం మీద ధర్మచక్రం , అటూ ఇటూ లేళ్ళు(మృగదావనం) చెక్కిన ఆధారం దొరికింది. రాష్ట్రకూటశిల్పశైలి (క్రీ.శ.8వ శ. )కి అద్దంపదుతున్న ఈ పీఠం ప్రస్తుతం గుంటూరుజిల్లా అమరావతిలోని అమరావతి మ్యూజియం మరియు ఇంటర్ ప్రిటేషన్ సెంటర్ బయట ప్రదర్శనలో వుంది' అని రాసారు. అంటే అప్పట్లో రాష్ట్రకూటులు కొలనుపాకను ఏలారని , వారి కాలంలో బౌద్ధమిక్కడ వుందని తెలుస్తుంది. ఇటీవల అచ్చుతీసి నేను చదివిన కొత్తశాసనం 'నల్గొండజిల్లా ఆమనగల్లుశాసనంలో క్రీ.శ.888లో రెండవ కృష్ణుని(అకాలవర్షుడు)పాలనలో మహాసామంతాధిపతిగా పేర్కొన్న శంకరగండరస కొల్లిపాక-20 ,000నాడును రాజధానిగా ఏలాడని తెలిసింది.కొలనుపాక రాష్ట్రకూటుల పాలనలో వుందని తెలిపిన శాసనమిది.

   ఆమనగల్లు శాసనం

1. స్వస్త్యకాలవర్ష దేవ
2. శ్రీపృథ్వీవల్లభ మహారా
3. జాధిరాజ పరమేశ్వర ప
4. రమ భట్టారక ప్రవర్ధమా

5. న విజయరాజ్యాభివృ
6. ద్ధి యుత్తరోత్తర సల్బత్తి
7. ర తత్పాదపక్షోప సేవి. .
8. సమధిగత పంచమహా
9. శబ్ద మహా సామాన్తాధి
10. పతి జయధీర భువనయ్క
11. రామనభిమాన ధవళ ర
12. ట్టర మేరు రాజభూరిశ్రవ
13. విద్విష్ట నారాయణీం ధర్మ
14. రత్నాగరం శ్రీమత్సంకర గండ
15. రస క్రొళ్ళిపాకే రాజధాన
16. యాగిర్పత్తోచ్చొ సిరనాళు. .

4. దీనికి కొల్లిపాక– 7000నాడు పాలకుడు కుమారసోమేశ్వరుడు తన మహాప్రధాన ,మానవెర్గడె,దండనాథుడైన సాయిమయ్య వినతి మేరకు ‘పానుపురాయి’అనే గ్రామాన్ని సర్వమాన్యంగా దానం చేసాడు.సాయిమయ్య చతుస్సమయాలను ఉద్ధరించినవాడు. మేషపాషాణగచ్ఛ కాణూరుగణానికి చెందిన చంద్రమలధారి శిష్యుడు చంద్రప్రభసూరి అని పిలువబడే పద్మానందసూరి చిన్నతమ్ముడు సిద్ధాంతవేద శిష్యుడైన కేశిరాజు అనే మంత్రి అక్కబసదికి జైనమానస్తంభాన్ని ఎత్తించాడు.ఈ స్తంభానికి నాలుగువైపుల శాసనం రాయబడి వుంది.ఇది త్రిభువనమల్ల విక్రమాదిత్యుని పాలనాకాలంలో క్రీ. శ. 1125, మార్చి 23న వేయబడిన శాసనం. ( inscriptions of AP, Nalgonda vol–II, Ins. No. 20, p. no:63 )

***సాయిగూడెం:***మావూరు ఆలేరుకు తల్లివూరు సాయిగూడెమని చెప్తారు.అసలు ఆలేరు లేనేలేదు ,రైల్వేలైనొచ్చినంక ఏర్పడ్డదని అనే పెద్దలున్నారు.మరి ఈ చరిత్రంత ఎక్కడిది.సాయిగూడెం మా పితామహులగ్రామం.చోళులదాడిలో నేలమట్టమయినపుడో ,ఆలేటివాగు వరదల్లో మునిగినపుడో ఆలేరుగ్రామం ప్రజలక్కడికి వలసపోయి వుంటారు.సాయిగూడెమంటే సాహిణిగూడెం (అశ్వసైన్యాల గుడారం) అని,ఈవూరికి 4 కి. మీ. దూరంలోనే వున్న బంటుగూడెం అంటే పదాతిదళాల(కాల్బంట్ల)గుడారం అని ఈ ప్రాంత గ్రామనామాల మీద పరిశోధన చేస్తున్న విరువంటి గోపాలకృష్ణ చెప్పారు.





సాయిగూడెంలో పురాతనరామాలయం వున్న పరుపుబండ వుంది.దాన్ని రామునిబండ అని పిలుస్తారు ప్రజలు. దీనికే యోగాచలమని నామాంతర ముంది.ఇక్కడ పురాతనమైన శివాలయముంది.ఈ ఆలయాల ముందర పెద్దనీటిగుం(కుం)డం వుంది.ఈ గుండంలో తూర్పున

మెట్టువంటిచోట కదిలే శివలింగం వుంది.గుడిచుట్టు పెద్ద ప్రాకారముంది. ఇట్లాంటి ప్రాకారాలు దుద్దెడ ,ఆలేరువంటి చోట్ల వుండేవి.ఈ దేవాలయం లో వున్న గరుత్మంతుడు ,హనుమంతుని విగ్రహాలు పెద్దవి.16వ శతాబ్దానికి చెందిన శిల్పాలవి. దేవాలయానికి దూరంగా చెలకలో గుడికి చెందిన రాతిరథచక్రాలు పడివుండేవి.ప్రతి చైత్రపూర్ణిమకు జరిగే 'బండమీది దోపు'అని పిలిచే రాములవారికళ్యాణం పెద్దజాతరగా వుండేది. ఇపుడు లఘురూపంలోకి వచ్చింది. ఒకప్పుడు రాములవారి కళ్యాణానికి నిజాంరాజు ఏనుగుఅంబారీలో తలంబ్రాలు , పట్టువస్త్రాలు పంపేవారట. ఆ ఏనుగు ఈ గుండంలోపడి చనిపోవడంతో నిజాం నజరానాలు ఆగిపోయాయి.జాతర వేడుక తగ్గిపోయింది.గుడిముందరి చెలకలో తలలు తెగిన జైనవిగ్రహాలు వుండేవట.పూర్వమిక్కడ జైనబసదేమైనా వుండేదేమొ. సాయిగూడెంలో ఒక మట్టికోట (గడి?)ఆనవాళ్ళున్నాయి. గ్రామంలో రామాలయం,శివాలయా లున్నాయి.ఇవి గాక అమ్మదేవతల గుళ్ళున్నాయి.

సాయిగూడెం ఒకప్పుడు ఖాల్సా గ్రామం. మా అయ్యలకాలంలో ఆలేరు పరిపాలనంతా ఈ వూరినుండే సాగుతుండేది.పటేండ్లు, పట్వారీలు ఇక్కడివారే.కట్టెగుమ్ములరెడ్లకు మాలీపటేల్ గిరి ,గుంటుకరెడ్లకు పోలీసుపటేల్ గిరి, ఆకవరం వారికి కరణంగిరి వుండేయి. వసూలైన రకం (రెవెన్యూ)భువనగిరితహశీలుకు పొయ్యేది. పనివాండ్లు కూడా ఇక్కడివారే. ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులుండేవారు. వైష్ణవ పండితులుండేవారు.

సాయిగూడెం ఆదిమానవుల నిలయం కూడా. వూరికి దక్షిణాన వున్న నల్లగుట్ట ఒకప్పుడు ఆదిమానవుల ఆవాసం.రాతిపనిముట్ల తయారీకేంద్రం.ఇక్కడ అనేకంగా మధ్య పాతరాతియుగంనాటివి, కొత్తరాతియుగంనాటివి పనిముట్లు లభించాయి.చుట్టు పొలాలు కావడంవల్ల ఆనవాళ్ళు చెరిగిపోయాయి. పోతున్నాయి. నల్లగుట్ట ఎత్తు

తక్కువగా వున్నది. గుట్ట మధ్య చిన్న సొరికె , ఆ సొరికెలో (మల్లన్నదేవుని గుహ అంటారు)నలుగురైదుగురు తలదాచుకునే చోటుంది. గుట్ట అంచున మోగే రాయి ( Ringing stone) వుంది. దాని మీద రాయితో కొడితే ఖంగుమనినాదం వినిపిస్తుంది. అక్కడికి తూర్పున శాసనశిలలు తయారుచేసిన ఆనవాలుగా ఒక శాసనరాతిస్తంభం విరిగిపడి వుంది. ఈ చుట్టుపక్కల ఆదిమానవుల సమాధులచుట్టు పాతిన చుట్టురాళ్ళు ( Rock boulders) ఇక్కడివే కావొచ్చు. ఒకప్పుడు ఎత్తుగావుండే ఈ ప్రదేశం ఆలేటివాగు వరదల్లో సగానికి మునిగిపోయింది. ఇసుకనిండిన పొలాలే దానికి సాక్ష్యం. నల్లగుట్టదగ్గర పాతవూరు ఆనవాళ్ళున్నాయి. దిబ్బకు ఆంజనేయుని విగ్రహం గుర్తుగా మిగిలిపోయివుంది.






***గుండ్లగూడెం.***ఆలేరుకు మరొక పొరుగు గ్రామం గుండ్లగూడెం. ఒకప్పుడు ఆలేరు గ్రామపంచాయతీలోనే వుండే వూరు గుండ్లగూడెం. ఆలేటివాగును నిలువరించి మలుపుతిప్పిన గుండ్లగడ్డ. ఈ వూరిలో వందేళ్ళ కిందటి (1901 క్రీ. శ. ) సి. ఎస్. ఐ. పాఠశాల వుంది. మొదటి నిజాంచేత 1701లో సంస్థాన్ నారాయణపురాన్ని ఇనాంగా పొందిన సోమిరెడ్డి కుమారుడు రాయన్ రెడ్డి రాజారాయన్నగా ప్రసిద్ధుడు.

ఒక గొప్పకోటను నిర్మించడానికి ఆలేరుప్రాంతాన్ని పరిశీలించి గుండ్లగూడెంవద్ద ఆలేరువాగు ఒడ్డున మొదలుపెట్టి ఎందుకో అర్థాంతరంగా వొదిలేసారు.ఆ కోటగోడల శిథిలాలున్నాయి. అక్కడొక జీర్ణ శివాలయం వుంది.ఆ శివాలయపు లలాటబింబం ఏనుగులు శివార్చన చేస్తున్నట్లుంది.ఇట్లాంటి లలాటబింబాలున్న గుళ్ళను కరీంనగర్ జంగంరెడ్డిగూడెంలో,కీసరలో చూసాం.అవి శైవమఠాలు.ఇపుడా శివాలయంలో లింగం, నందులు లేవు. గ్రామంలో పాతగుడి వుంది. దాని ఆనవాళ్ళే మిగిలివున్నాయి.ఆ తర్వాత రాజరాయన్న రాజపేటలో కోటకట్టాడు.





***రామసముద్రం:***

ఆలేరుకు మధిరగ్రామమైన రామసముద్రం చాలా చిన్నది. బావుల దగ్గర కట్టుకున్న ఇండ్లతోటే వూరుగా మారిపోయిందిపుడు. ఇక్కడకూడ పాటిగడ్డ వుందని పెద్దలు చెప్పేవారు. అక్కడ నంది , శివలింగం లభించాయి.

రామసముద్రంలోనే తాటిచెట్టంత లోతున్న తలపర్రె వుండేది. దాని ఆనవాళ్ళే మిగిలాయిపుడు.

మొన్న మొన్నటిదాకా ఆలేరుగ్రామంలోనివే సాయిగూడెం , గుండ్లగూడెం,రామసముద్రాలు.గ్రామాలు పెరిగి ప్రత్యేక గ్రామపంచాయతీలుగా మారిపోయాయి.

***మందనపల్లి:***సాయిగూడెం, కొల్లూరుల నడిమివూరు మందనపల్లి. గ్రామంలో ప్రాచీనమైన రాజరాజేశ్వరుని(శివుని) గుడి వుంది. ఈ గుడిని వెయ్యేండ్ల కింద ఎల్లంభట్టనే పండితుడు కట్టించాడట. ఇతని పేరు మీద ఒక కుంట ,కుంటకట్ట వున్నాయి.ఆ తర్వాతకాలంలో శిథిలమైన దేవాలయాన్ని కొత్తూరి చిన్న సిద్ధిరామయ్య జీర్ణోద్ధారణ చేసాడు. గుడి కవతల కొద్ది దూరంలో గజం దూరాలతో 3 బొడ్రాళ్ళున్నాయి. వందల ఏండ్ల కింద వరదల కారణంగా వూరును 3 సార్లు పునర్నిర్మాణం చేసినారని గ్రామస్తులు చెప్పారు. బహుశః ఆ సమయంలోనే సాయిగూడెం కూడా వరదమట్టితో పూడిపోయి వుంటుంది. బొడ్రాళ్ళకు అరమైలు దూరంలో పరుపుబండ మీద గిద్దలమ్మ దేవత చెక్కివుంది. చతుర్భుజియైన ఈ దేవతనిక్కడ ఎందుకు చెక్కారో?అక్కడే ఆ బండమీద పాదాలగుర్తులు చెక్కబడివున్నాయి.మరికొంత దూరంలో చౌడలమ్మగుడి వుంది. (మందనపల్లి వాసి అయిలవీరన్న చెప్పిన సమాచారం.)





***కొల్లూరు:***మందనపల్లి దాటగానే కొల్లూరు. కొల్లూరు పూర్వనామం కోళూరు. ఆలేటివాగు వరదల్లో పాత కొల్లూరు మునిగిపోతే ఇపుడున్న వూరిని కొత్తగా పొందించారు.పాత కొల్లూరులో పురాతన దేవాలయాల శిథిలాలున్నాయి. శివాలయంలో పెద్దలింగం , వినాయకుని విగ్రహం,కూలిన మరోగుడి ముందర పడివున్న విరిగిన సుందర లక్ష్మీనరసింహస్వామి విగ్రహం ,కొంతదూరాన ధ్యానస్థితిలోవున్న జినదేవునిస్తంభం ప్రస్తుతం అక్కడలభిస్తున్న ఆనవాళ్ళు.వూరికి అన్నిదిక్కుల్లో అమ్మదేవతలు ,మరికొన్ని దేవాలయాల

జాడలగుపిస్తున్నాయి.కొలనుపాకలాగా జైన ,శైవ,వైష్ణవమతాలు పోటాపోటీగా విస్తరిల్లిన మరొక చారిత్రక కూడలి కొల్లూరు.









***బహదూర్ పేట:*** ఆలేరుకు దక్షిణాన కి. మీ. దూరంలోని గ్రామం. ఈవూరు రత్నాలవాగొడ్డున వుంది.ఈ వూరిలో చారిత్రక విశేషాలు పెద్దగాలేవు. ఒకప్పుడు ఈ వూరు ఆలేరుకు మధిరగ్రామమే. వూరిలో నిజాం కాలంనాటి బురుజొకటి శిథిలమై కనిపిస్తుంది. వూరి బయట పోచమ్మగుడి ఆవరణలో అందమైన , నల్లని భైరవుని విగ్రహం వుంది. రాచకొండ ప్రభువుల భైరవారాధన ప్రతీకనేమో.





***మంతపురిః*** మంతపురిలో శివాలయముంది.గుడిముందర శాసనస్తంభం.మంతపురిశాసనంపేరుతో ప్రసిద్ధమైనది ఈవూరు.ఈ రాష్ట్రకూటులశాసనకాలం క్రీ.శ.973 నవంబరు10. అయ్యనయ్య అనబడే మహాసామాంతాధిపతి(రణధీర,నుర్మాడి ధవళ ,నన్నియమేరు బిరుదాంకితుడు)రణధీరేశ్వరాలయానికి తోట ,పంటభూములు రాజమానం (Royal Measure) ప్రకారం ఇచ్చిన దానశాసనం అది. ( Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 2, p:2-4)ఈశాసనంలో పేర్కొన్న రాజు , రాజ్యం సంగతి నేటికి అపరిశోధితమే.వూరినానుకుని పెద్దకందుకూరు నుండి వచ్చే వాగు వుంది. వాగు దగ్గరలో మాతంగిగుడి వుంది. ప్రసిద్ద మంతపురి అల్లరసర కాలువ (నల్గొండశాసనాలు-I, సం:11)ఇక్కడిదే. పూర్వం అయ్యనరసరు అనే రాష్ట్రకూటుల సామాంతాధిపతి మంతపురి(కంపణం వంటిది) పాలకుడుగా వుండవచ్చని చరిత్రకారులవూహ.





***దిలావర్ పూరు:*** మంతపురి దాటాక సూటిగా వెళ్తే దిలావర్ పూర్ లేదా జలాల్ పూర్ వస్తుంది. వూరిలోనికి వెళ్ళక ముందే చిన్నగుట్ట , ఆ గుట్టఅంచున బాటకే భైరవుడు చెక్కబడివున్నాడు. పక్కన శాసనముంది. పూర్తిగా జీర్ణమైపోయింది. ఒకటి , రెండు అక్షరాలుకూడా చదివేటట్టులేవు. గుట్టపైన నిజాంకాలంనాటి మసీదు ,సైనికస్థావర నిర్మాణం వుంది. వూరిలో శివాలయం ,గుడిలో పెద్దలింగం ,వీరభద్రుడు,నంది విగ్రహాలున్నాయి. అక్కడినుండి రాయికుంట, మేడికుంట, మూటకోడూరు వెళ్ళే దారిలో జంగమోల్ల మాన్యపు భూముల కెదురుగా పిట్టల గుండుకు '1. శ్రీ రా---2. కొలిపాక అంకన 3. అంకయ కొమా 4. రుదు యయితన 5. చేసిన ప్రది 6. ష్ట శ్రీ 'అని రాసివుంది. ఇది నల్గొండ జిల్లాశాసనాల్లో అచ్చయింది.

(Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 146, p:347-348)









**మూటకొండూరుః**

మూటకొండూరు ప్రాచీనగ్రామం.ఇక్కడ నవీనశిలాయుగంనాటి ఆదిమానవుల సమాధులున్నాయి.చారిత్రకకాలంలో ఇక్కడ యుద్ధాలు జరిగివుంటాయేమో.అందుకనే కావొచ్చు పదులకొద్ది వీరగల్లులున్నాయిక్కడ.ఒక వీరగల్లు మీద వున్న తెలుగులిపి కాలం 7 , 8 శతాబ్దాలనాటిది.వీరగల్లులను ఇక్కడి శివాలయం ముందర చేర్చినట్టుంది. పెద్దశివాలయం వెనక మరొక చిన్నశివాలయం కూడా వుంది. శివాలయం ముందరి ద్వారమంటపం రెండంతస్తుల్లో వుంది. ఇట్లాంటి మంటపాలు అరుదుగా వున్నాయి.వలిగొండ నాగారం శంకరంగుట్ట దగ్గర పంచలింగేశ్వరాలయం ముందర , మెదక్ జిల్లాలోని దుద్దెడ , సిద్దిపేటల్లో ఇటువంటి ద్వారమంటపాలను చూడవచ్చు. విష్ణుకుండినుల కాలంలో

రామలింగేశ్వరాలయాలు నిర్మించబడ్డవని చరిత్ర చెపుతున్నది.ఈ శివాలయనిర్మాణం కూడా పురాతనమైనదే.కాని చాలాసార్లు పునరుద్దరించ బడ్డట్లుంది.ఆలయానికి అర్ధమంటపం చిన్నదిగా వుంది. ముఖమంటపద్వారానికి ఇరువైపుల పూర్ణకుంభాలున్నాయి.లోపల అర్ధమంటపంలో రంగమంటపం వుంది.ఎనిమిది స్తంభాలున్నాయి. అంతరాళద్వారానికి రెండువైపుల సర్పాలు ,గదలను(లగుడాలా?) ధరించిన రెండుచేతులున్న ద్వారపాలకులుండడం విశేషం.గర్భగుడిలో చతురస్రాకారపు పానవట్టం మీద శివలింగం ప్రతిష్ఠితమై వుంది. గుడిముందర పూర్తిగా చెక్కని నల్లరాతినంది వుంది. దేవాలయప్రాంగణంలో చతురస్రాకారపు పానవట్టం మీద చిన్నశివలింగం,కొన్ని నాగశిల్పాలున్నాయి.

గుడివెనక నాలుగడుగుల ఎత్తున్న శివునిగుడిలో రెండడుగుల ఎత్తున్న శివలింగం ,చతురస్రాకారపు పానవట్టంపై ప్రతిష్ఠించింది. గర్భగుడి తప్ప వేరే నిర్మాణం లేదు.దేవాలయద్వారానికి ఇరువైపుల ద్వారబంధాలపై వున్న కలశాలు ఇది జైనమని చెప్పడానికి నిదర్శనం. ఈ గుడిలో శివలింగ ప్రతిష్ట తర్వాతికాలంలో జరిగినట్టు తెలుస్తున్నది.

ఈ దేవాలయాల ప్రాంగణానికి ఈశాన్యాన మరో రెండు దైవస్థానాలున్నాయి. ఒకటి విశ్వకర్మమందిరం.మరొకటి అమ్మదేవతల ప్రాంగణం.అర్ధగోళాకారపుగోడలో ఏర్పరిచిన తట్టులో ఐదుశిల్పాలు న్నాయి.ఎడమనుండి కుడికి ఒక శైవాచార్యుని (?)విగ్రహం ,రెండోది ముంగిసవాహనం,చతుర్భుజి,ఖడ్గం,ఢమరుకం,త్రిశూలం,పానపాత్రలతో ఎడమపాదం భూమికానించిన ఆసనస్థితిలో వున్న అమ్మదేవత చండిక , మూడోది నక్కవాహనం ,చతుర్భుజి,ఖడ్గం,ఢమరుకం,త్రిశూలం, పానపాత్రలతో కుడిపాదం నేలకానించిన ఆసనస్థితిలో చాముండ ,

నాలుగోది ఏనుగువాహనం , చతుర్భుజి, ఖడ్గం, ఢమరుకం, త్రిశూలం, పానపాత్రలతో ఎడమపాదం నేలకానించిన ఆసనస్థితిలో ఐరావతి , ఐదోది చతుర్భుజుడు,బలిఖడ్గం,ఢమరుకం,త్రిశూలం,కపాలపాత్రలతో నగ్న భైరవుడున్నారు.ఈ విగ్రహాలు ఆనాటిప్రజల విశ్వాసాలను ప్రతిఫలించే మూర్తిమత్వాలు.అవి శక్త్యారాధన , భైరవారాధనలకొరకు అప్పటి వారు జైన, బౌద్ధమతాలకు ప్రతిగా, వ్యతిరేకంగా నెలకొల్పిన ఆరాధనాస్థలాలు. అందుకే జైనబసదులు శివాలయాలుగా పరివర్తింపబడ్డాయి. ఇక్కడ గ్రామం మధ్యలో వందేళ్ళకిత్రం కట్టిన రామాలయం వుంది. చెరువు దగ్గర శిథిలవిగ్రహాలు పోగులుపడివున్నాయి.ఆంజనేయుని గుడి దగ్గర లభించిన శాసనంలో కళ్యాణీ చాళుక్యచక్రవర్తి జగదేకమల్లు పొత్తలకెరె (పటాన్ చెరు) నెలవీడులో వున్నట్టు మాత్రమే తెలుస్తున్నది. శిథిలమై , భిన్నమై వున్న శాసనంలో వివరాలు గ్రహించడానికి వీలులేకుండావుంది.
( Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 52, p:143).మూటకొండూరు కాటేపల్లిల నడుమ చిన్నఒర్రెఒడ్డున గాజులపరిశ్రమ ఆనవాళ్ళున్నాయని గ్రామస్తులు చెప్పారు.









***ఇక్కుర్తిః***

ఇక్కుర్తి గొప్ప చారిత్రకస్థలం. అతిపురాతన నాగరికతల నిలయం. ఆలేరునదీలోయనాగరికతకు ఇక్కుర్తి ఒక నిదర్శనం. ఆదిమానవులకాలం నుండి నేటివరకు చరిత్రను పుక్కిటపట్టిన కాలనిఘంటువు , విజ్ఞానసర్వస్వం ఈ వూరు.ఇక్కుర్తి పేరు ఇక్కురికి నుండి పరిణమించింది. ఈ+కురికి ఇక్కురికి అయింది. కురికి అంటే పురాతన ధాన్య విశేషం. ఇక్కురికే పలుకుబడిలో ఇక్కుర్తిగా పిలువబడుతున్నది పాల్కురికి పాలకుర్తి అయినట్లు.

ఇక్కుర్తి నల్లగొండ జిల్లా ఆలేరుమండలంలోని గ్రామం. యాదగిరిగుట్ట దగ్గరవున్న సైదాపురంలో లభించిన ఒకశాసనంలో (సైదాపురం శాసనం)ఇక్కుర్తి చారిత్రకంగా పేర్కొనబడింది ఆలేరుకు కొలనుపాక, ఇక్కుర్తి గ్రామాలు సమాన ( 7 కి. మీ. ల) దూరంలో

ఉన్నాయి. ఈ రెండు గ్రామాలు జైనమతకేంద్రాలుగా ప్రసిద్ధం. కాని ,
జైనమతంలోని పరిణామాలు దిగంబరజైనానికి ఆదరణ తగ్గి ,
ఆడంబరపూర్వకంగా మారిన శ్వేతాంబరజైనానికి చెల్లుబాటు పెరిగింది. ఆలయాలు, సంపదలు, గౌరవాలు ఎక్కువైనాయి. అదిగాక కొలనుపాక కళ్యాణీచాళుక్యుల నెలవీడు (ఉపరాజధాని) కావడం మూలాన అక్కడే ఉన్న మిగతా గుళ్ళతోపాటు జైనదేవాలయం ప్రసిద్ధమైంది. అగ్గలయ్య ఆధ్వర్యంలో ఇక్కుర్తి దిగంబర జైనకేంద్రంగా వుండేది.



ఇక్కడ బుద్ధసేనజినాలయం అనే జైనబసది వుండేది. దానికి రాజులు దానాలు , కానుకలు ఇస్తుండేవారు.అగ్గలయ్య జైనమతాన్ని సేవిస్తూ తానిక్కడ పెంచిన మూలికలతో ప్రజలకు ఉచితవైద్యసేవ లందిస్తుండేవాడు.అవసరపడినపుడు శస్త్రచికిత్సలు కూడా చేసేవాడు. కళ్యాణి చాళుక్యరాజు రెండో జయసింహుడు నెలవీడు పటాన్ చెరు (పొత్తలకెరె)లో వున్నపుడు క్రీ.శ.1034లో వైద్యరత్నాకర , ప్రాణాచార్య బిరుదులుగొన్న అగ్గలయ్య అడిగినందువల్ల ముచ్చనపల్లిలోని బుద్ధసేనజినాలయానికి,ఇక్కుర్తిలోని వైద్యరత్నాకరజినాలయానికి దానాలుచేసాడని తొలిసైదాపురం శాసనంలో వుంది. కొలనుపాక-7000లనాడులోని ఒక కంపణం ఆలేరు-40. ఆలేటికంపణంలోనిది

ఇక్కుర్తి. అగ్గలయ్య గురించి మెదక్ జిల్లా సిరూర్ శాసనంలో వివరించబడ్డది. అగ్గలయ్య జైన మాలవగణానికి చెందిన యూపనీయ సంఘానికి చెందినవాడు. సిరూరు శాసనం (క్రీ. శ. 1074) లో కళ్యాణి చాళుక్యరాజు రెండో సోమేశ్వరుడు అగ్గలయ్యను తన ప్రధానఅడపం (రాజుకు ఆకులు , వక్కలు అందించే అధికారి)గాను , మహాసామంత పదవినిచ్చి ముచ్చనపల్లికి గావుండగా నియమించాడని వుంది. దాదాపు 50యేళ్ళపాటు రాజాశ్రయంలో వున్నట్టు తెలుస్తున్నది.

ఇక్కడి గుట్టమీద పార్శ్వనాథుని విగ్రహం, జిన అనే అక్షరాలున్న రాతిపలక వుంది. ఇదే అగ్గలయ్య దానం పొందిన వైద్యరత్నాకర జినాలయం. కోనేరు , జైనపాదాలు, జైనమునులు తపస్సుచేసుకునే రాతిగదులు ఈగుట్టమీద మనం చూడొచ్చు. అంతేగాక శివాలయాలు , కాళికగుడి, ఆంజనేయుని గుడి , కొశెగుట్టపై రాజరాజేశ్వరుని గుడి , పొలాల్లో మట్టిలో మునిగిపోయి వున్న గణపతి, అనేక శిథిలాలయాల ఆనవాళ్ళు, వాటిపై కలశాలు చెక్కివున్నాయి. ఇక్కుర్తిగుట్టకు ఉత్తరంవైపు బండకు జైనయక్షిణి (అన్నపూర్ణ) ? విగ్రహం చెక్కివుంది.

ఇక్కుర్తిబండ లేదా బోడుగా పిలవబడుతున్న ఇక్కుర్తి చెరువుపక్క క్వారీగుట్టమీద పడమటివైపు ఒక బండరాయికి పార్శ్వనాథుని విగ్రహం చెక్కబడివుంది. అక్కడ గుడి వుండేదని చెప్పడానికి ఆనవాలుగా గుడిశేరడు రాతిముక్క పడివుందక్కడ. ఆ విగ్రహం ముందరవున్న విశాలమైన చదునైన రాతిప్రదేశం ఒకప్పుడు జైనమునుల ధ్యానాలతో , ప్రార్థనలతో గొప్పప్రాభవంగా వుండి వుంటుంది. అక్కడికి తూర్పు కొసన ఒక నీటిగుండం (కోనేరు)వుంది. గుండం ఒడ్డున దేవునిపాదాలు చెక్కివున్నాయి. ఈ గుండం ఒకప్పుడు స్నానవాటిక. ఇక్కడ స్నానం చేస్తూ గట్టున పెట్టిన బట్టలను 'బట్టలభైరవుడు' ఎత్తుకపోయేవాడట.

బట్టలభైరవుడు, బత్తలభైరవుడు, బరివాతల దేవుడని స్థానికులు పిలిచేది పార్శ్వనాథుణ్ణే. గుండం పైకి దక్షిణందిశన జైనమునులు కూర్చుని ధ్యానం చేసుకునేంత చిన్న చిన్నవి, పైకప్పులేనివి, 4 అడుగులఎత్తుండే రాతిగదుల వంటివి పదిదాకా వుండేవి. అవన్నీ క్వారీలో బండలు కొట్టడంలోనే నష్టమైపోయాయి.

పార్శ్వనాథునికి,గుండానికి మధ్య గుట్ట దిగువగా రెండు గుహలున్నవి. మొదటి గుహలో శివాలయం , అంతరాళంలో దక్షిణాన వీరభద్రుడు,ఉత్తరాన వినాయకుడు గోడలోనే తాపడం చేయబడివున్నారు. గుడి బయట ద్వారపాలకులు చక్కగా చెక్కబడివున్నారు. అక్కడే ఒక విరిగిన విగ్రహం పడివుంది. దానికి రెండువైపుల శిల్పాలున్నాయి. ఒకవైపున్న బొమ్మ అసంపూర్ణ దేవతశిల్పం. రెండోవైపు తలలేని జైనమూర్తిది. ఆకారాన్ని చెక్కేసి బొమ్మకనబడకుండా చేసారు. గుడి ఎదురుగా నాగశిల్పాలున్నాయి. రెండో గుహ ఖాళీగావుంది.

గుట్ట దిగి పదడుగులు వేసి తూర్పుకు వస్తే గుట్టరాయికి అద్భుతమైన 'అన్నపూర్ణ' దేవి శిల్పం చెక్కివుంది. పైన శివాలయం , కింద అన్నపూర్ణ శైవమతవిస్తరణను సూచిస్తున్నాయి. గుట్టకు ఉత్తరాన గ్రామంలో అగ్గలయ్య సమాధివుండేదిట. ఏనుగులసమాధి , గురువు సమాధి అని పిలిచేవారట. ఇపుడక్కడ ఆనవాలేదీ మిగిలిలేదు.

గుట్టవెనక దక్షిణం దిక్కున ఆదిమానవుల సమాధులున్నాయి. వాటిలో ఎక్కువగా సిస్తుసమాధులే. కాని , అక్కడ 6 అడుగుల ఎత్తున్న రెండు మెన్హర్లుండడం విశేషం. ఇక్కడ నుండి ప్రారంభమై దాదాపు రెండు కి. మీ. లు ఆదిమానవుల సమాధులు విస్తరించివున్నాయి. వీటిలో సిస్తు సమాధులు, కైరన్లు, డోల్మన్లున్నాయి. ఈ పెట్టెసమాధుల్లో కొన్నింటిలో

ఒకేసారి రెండు , మూడు దేహాలను పెట్టిసమాధి చేసినట్లు తెలుస్తున్నది. కొన్ని సమాధుల్లో దక్షిణందిక్కు తలవైపు బండకు ఒక రంధ్రం చెక్కబడివుంది.ఇది ద్రవిడ సంప్రదాయం. సమాధిచేయడమే ద్రవిడ సంప్రదాయమంటారు.ఇక్కడ బీరప్పగుడిలో లింగాలుగా పూజింప బడుతున్నవి ఒకప్పటి ఆదిమానవుల చేతుల్లోని రాతిపనిముట్లు. రాతిగొడ్డళ్ళు,బొరిగెలు,రాతిసుత్తెలు,రాతికత్తులు ఒకప్పుడు 16 పనిముట్లుండేవి గుడిలో.

వూరికి తూర్పున కొశెగుట్ట వుంది. దాని శిఖరం కొశెగా (వాడిగా) వుందని దాన్ని కొశెగుట్టని పిలుస్తారు ప్రజలు. ఆ గుట్టమీద రాజేశ్వరుని గుడి వుంది. చిన్న గుహలో చిన్నలింగం ప్రతిష్టించబడివుంది. గుట్టమీద గుహలు, ఆదిమానవుల ఆవాసాలున్నాయి. గుట్టకొసన పడమటిదిక్కు రాయికి 'వి' వంటి గుర్తు లోతుగా గంటు చెక్కబడివున్నది. అట్లాంటి గుర్తులను ఆదిమానవుల వాళ్ళ సంచార , నివాస దిశలను తెలుపడానికి వాడుకుంటారని చరిత్రకారులు రాసారు. రైతులు కొత్తపొలాలు అచ్చుకట్టేటప్పుడు తవ్వితే ఈ సమాధుల్లో కొన్ని ఇనుపపనిముట్లు , కుండలు దొరికాయట. అవేవీ మాకు ఎవరు చూపలేదు కాని ఒక కుండపెంకు మీద 'బ్రాహ్మీ'లిపిలో త అనే అక్షరం వంటి గుర్తుండడం చూసాం. ఈ సమాధులు , అక్కడ దొరికిన , పరిశీలించిన ఆధారాలవల్ల ఆదిమానవులిక్కడ పదివేలయేళ్ళ క్రితంనుండి నివసిస్తుండేవారని బోధపడుతున్నది. రాతిపనిముట్లు కొత్తరాతియుగానికి చెందినవే. సమాధులే కొంచెం పాతవి లాగున్నవి.

వివిధకాలాలకుచెందిన ఇట్లాంటి రాకాసిబొందలు ,రక్కసిగుళ్ళు, ఆదిమానవుల సమాధులు(సిస్తులు ,కైరన్ లు ,డోల్మన్లు,మెన్హర్లు)

ఇక్కుర్తిలోనే కాదు చుట్టుపక్కల గొలనుకొండ ,మూటకొండూరు, రాయగిరి, బోనగిరి, బీబీనగర్, ఘట్కేసర్, వాసాలమర్రి, ఇబ్రహీంపట్నం, చల్లూరు,రఘునాథపురం,లక్ష్మక్కపల్లె,పోచన్నపేట,బచ్చన్నపేట,సిద్ధుల గుట్ట,జనగాం,కళ్ళెం,ఎటూ 50 నుండి వంద కిలోమీటర్ల దూరం ఆదిమానవుల సమాధులు విస్తారంగా విస్తరించి వున్నాయి. హైదరాబాద్ చుట్టుపక్కల ఎక్కడ వెతికినా ఆదిమానవుల పురాయుగపు స్మృతిచిహ్నాలు లెక్కలేనన్ని లభిస్తున్నాయి.సమాధులు ,రాతిపనిముట్లు,రాతిచిత్రాలు, కుండలు,రాతలవంటిజాడలు ఎన్నెన్నోదొరకడం తెలంగాణా ఏ పూర్వ చారిత్రకప్రదేశాలతోనైనా సమానంగానో,మిన్నగానో వుందని తెలుస్తున్నది. పరిశోధనలు జరగాలి. కొత్త తెలంగాణా చరిత్ర తిరిగి రాయాలి.

గుట్టఅడుగున నేలమీద దొరికేపెంకులు , ఇటికపెల్లలు అక్కడొక పురాతనగ్రామం వుండేదనడానికి రుజువులు.గుట్టకు ఉత్తరాన అతిపురాతనమైన రెండుఆలయాలున్నాయి. ఒకటి శిథిలంకాగా, రెండవది పూజార్చనాదులకు నోచుకుంటున్నది. మొదటిది శివాలయం. ఆ గుళ్ళు రాష్ట్రకూటులకాలంనాటివే అనిపించడానికి అక్కడ పొలాల్లోలభించిన వినాయకునివిగ్రహం సాక్ష్యమిస్తున్నది.గాణపత్యం అధికంగా ఆదరించబడ్డకాలం రాష్ట్రకూటులదే.ఇంకా అక్కడిపొలాల్లో శిథిల దేవాలయాల ద్వారబంధాలు,లింగాలు, ఆంజనేయులవిగ్రహాలు దొరుకు తున్నాయి.ఇవన్నీకాక వూరిలో వీరగల్లులు చాలాచోట్ల వున్నాయి. కొన్నిజాగల అవి దేవుళ్ళుగా పూజింప బడుతు న్నాయి. మరొకగుడి వూరినడుమ వుంది. ఆగుళ్ళో దుర్గాదేవతను ప్రతిష్టించారు. మంటపంలో నంది, ఎదురుగా ఆంజనేయుడుండడం విశేషం. దేవాలయగోపురం మెట్లపద్ధతిలో వుంది.ఆ గోపురానికి చుట్టూ సున్నంతో చేసిన

బొమ్మలున్నాయి.వీరులు,ఒంటె,గుర్రాలు,పక్షులు ఇవే మిగిలి వున్నాయిపుడు. ఒకప్పుడు శృంగారశిల్పా లుండేవి.

ఏ విధంగా చూసినా ఇక్కుర్తిగ్రామం ఒకప్పుడు గొప్ప దేవాలయాల నిలయం అనిపిస్తుంది. పాతగుళ్ళవద్ద పాతమట్టిగోడల జాడలున్నాయి. అక్కడేమైనా మట్టికోటవుండేదేమో. . .















*శర్భనాపురం:*

ఇక్కుర్తి, మాటూర్ల నడుమ శర్భనాపురం చిన్నవూరు. ఈ వూరిలో అతిప్రాచీన శివాలయముంది. ఆ విగ్రహాలు గాలిలోని ఆమ్లానికి శైథిల్యం చెందివున్నాయి.క్రీ. శ. 1077 మే8 నాటి కొలనుపాక శాసనంవల్ల త్రిభువనమల్లవిక్రమాదిత్యుడు-6 చేత భువనైకమల్లసోమేశ్వరుడు-2 తొలగింపబడిన పిదప కందూరునాడును శాశ్వతంగా పొందిన ఏఋవ తొండయచోళ మహారాజుసేవకుడు 'ఇప శర్భయకామన' కొలిపాక సోమేశ్వర దేవరకు 2నందాదివిగెల నిమిత్తం 40 గద్యాలిచ్చాడని తెలుస్తున్నది.ఈ సేవకుడు(Sub-ordinate)రాజోద్యోగి అయినందుననే 40 గద్యాలివ్వ గలిగినాడనుకుంటా. బహుశః ఇతని పేరు మీద ఏర్పడ్డదే శర్భనాపురం కావొచ్చునని నా వూహ. (p:33Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 13,)





***మాటూరు:*** మాటూరులో మట్టిదిబ్బ మీద ఒకజీర్ణశాసనం (కన్నడభాషలో వుంది, కళ్యాణి చాళుక్యుల కాలంనాటిదని తెలుస్తున్నది) , శక్తివిగ్రహం, మరి రెండు వీరగల్లులు కనుగొనడం జరిగింది. మట్టిదిబ్బ అడుగున దేవాలయంవుందనడానికి అక్కడ ప్రహరిగోడ పునాది , దేవాలయ స్తంభాలు కనపడుతున్నాయి. ఈ వూరిలో కొలనుపాకలోని కులమఠాలకు ఆఖరు మఠం వుండేదట.వూరిబయట లాలుదర్వాజ అనే ప్రదేశంలో

గంటద్వారం వుంది.కళ్యాణిచాళుక్యరాజు ఆహవమల్లుని మహా సామంతుడు మెదక్-300పాలకుడు రేవణరసర్ మాటూరు వంశీయుడే. మాటూరు కా పేరు రావడానికి కారణాన్ని వూహించడానికి ఒకఅవకాశం.





***అమ్మనబోలు:*** అమ్మనబోలుకు ఆ పేరొచ్చినదన్నదాని గురించి వూరివాళ్ళు చెప్పే కైఫీయతు ఏమిటంటే పూర్వం ఆవూళ్ళో బొమ్మలసంత జరిగేదిట. సంతలో అమ్మదేవతల బొమ్మలమ్మేవారట. అందువల్ల అమ్మ బొమ్మలమ్మేవూరు పోయి అమ్మనబోలు అయిందిట. వూడ తెచ్చి పాతినచోట ఇప్పుడొక పెద్ద మర్రిచెట్టుంది దాని నీడనే సంతజరిగేదని ప్రజలంటుంటారు. వూరిలో వున్న దేవాలయాలు , వీరగల్లులు ఈవూరు ప్రాచీనమని చెప్పడానికి ఆధారంగా వున్నాయి.

అమ్మనబోలులో బడికానుకుని వున్న బావిఅంచున మత్స్యం బొమ్మ చెక్కబడివుంది. చేపబొమ్మ జైనమతప్రతీకగా చెప్పబడుతుంది. అక్కిడికి దగ్గరలో చిన్నగూడులాంటి గుడిలో గోడలో సప్తమాతృకల ఫలకం వుంది. దీనిని వూరివాళ్ళు అక్క , చెల్లెళ్ళ గుడి అంటారు. ఇంకా అక్కడ పొలాల్లో వీరగల్లుల శిల్పాలున్నాయి. నాలుగు ఎత్తైన దీపస్తంభాలు,

వేణుగోపాలస్వామి గుడి ,శివాలయం,వీరభద్రుడు,నేలలో మునిగి పోయివున్న 5అడుగుల ఎత్తైన వినాయకుని విగ్రహం,శాసనం వున్నాయి.









***గొలనుకొండ:*** అదేదారిలో పొరుగూరు గొలనుకొండలో చాలాఎత్తైన లింగాకారపుగుట్ట వుంది. దానికి పడమటివైపు శివాలయంలో అర్ధనారీశ్వరుడు,వినాయకుడు,విరిగిన వేణుగోపాలస్వామి శిల్పాలున్నాయి.అక్కడికి దగ్గరలో కొండకు చెక్కిన పన్నెండుగురు ఆళ్వారుల బొమ్మలు,శాసనంవున్నాయి.మరొకపక్కన కూర్మావతార విగ్రహం వుందట.వూరికి పడమటిదిక్కున పొలాలదారిలో లెక్కలగుండుశాసనం , దానిమీద గ్రామభూముల వివరాలున్నాయి.గ్రామపరిసరాల్లో చాలా పెద్దవైన ఆదిమానవులసమాధులున్నాయి.కొండపైన ఆదిమానవుల ఆవాసాలున్నట్టు అక్కడలభించే రాతిపనిముట్లు ,పాత్రలవల్ల గుర్తించవచ్చు.గొలనుకొండకూడా ప్రాచీనగ్రామమే.ఒకప్పుడు చరిత్రకు

పూర్వకాలంనుండే ఇక్కడ మానవులు నివాసమున్నారని,మానవ సంస్కృతీ వికాసానికి ఈవూరు కూడా ఒక స్థావరమే.






***జీడికల్లుః***

అక్కడకు దగ్గరలో వున్న జీడికల్లు ఒక తీర్థక్షేత్రం. ఇక్కడ జీడిగుండం , కల్లుగుండం అని రెండు గుండాలు అంచున పురాతన ఆలయమంటపం వుంది. దాని దగ్గర నాటివున్న ధ్వజస్తంభం మీద చిన్నశాసనం వుంది. ఆ శాసనంమీద

''శ్రీరామాచంద్రా

గుముడవెల్లి కత్తుల

తిమ్మరెడ్డి కొడుకు

అంబరెడ్డి కంభము

శ్రీశ్రీశ్రీ జయస్తు'' అని తెలుగుభాషలో , తెలుగులిపిలో రాసివుంది. ఇందులో పేర్కొనబడిన గుముడవెల్లి గ్రామం జీడికల్లుకు 2 కి. మీ. ల దూరంలోనే వుంది.

ఇక్కడ గుండం అంచున చెక్కివున్న తిరునామాల రూపంలో శ్రీరాముడు కొలువై వున్నాడు. అతి ప్రాచీనమైన ఈ క్షేత్రం ఒకపుడు ప్రసిద్ధవైష్ణవ పీఠంగా వుండేది. ఈ ప్రాంతంలో వైష్ణవమతకేంద్రంగా విలసిల్లినట్లు ప్రాచీన రచనలలో తెలుస్తుంది. వీరాచలంగా ప్రసిద్ధి ఈ క్షేత్రం. దీనినే హిడింబపర్వతం అని అంటారు. 'వీరాచల మహాత్మ్యం ' లో ఈ ప్రాంతవిశేషాలు చదువవచ్చు. ఇక్కడికి దగ్గరలో లేడిబండగా పిలువబడే ప్రదేశం వుంది. ఇక్కడే రాముడు మాయలేడిని వధించినట్లు స్థానికుల పురాణకథనం.

 

***షారాజిపేటః***

మరొక విశేషగ్రామం షారాజిపేట.ఈ వూరిలో పురాతన వెంకటేశ్వరాలయం, ప్రాచీన శివాలయాలు వున్నాయి. దొరగడి ముందర చక్రేశ్వరి వంటి జైనదేవత , ఇతర దేవతల శిల్పాలు , విరిగిన విగ్రహాలు అగుపిస్తాయి. చెరువులో నీరెండినపుడు బావులగుపిస్తాయని ఆ బావులలో మట్టిఒరలు లభించాయని ఇక్కడి పెద్దలు చెప్పారు. చెరువును 'అడ్లూరు' చెరువుగా పిలవడం విశేషం. అడ్లూరు అనే వూరు నిజామాబాద్ జిల్లాలో

వుంది. 400ల ఏండ్లక్రితం నిజాంపొలాలలో వ్యవసాయంచెయ్యడానికి నిజామాబాద్ జిల్లానుండి రెడ్డిరైతులను తీసుకొచ్చినట్లు సోమారం గ్రామం పెద్దరైతు కీ. శే. రాజిరెడ్డిగారు చెప్పారు. అక్కడివారు షారాజిపేటలో నివసించినపుడు ఈ చెరువును వారి వూరిపేరుతో పిలుచుకున్నారేమో. అడ్లూరి చెరువుకొసన టంగుటూరుకు దగ్గరలో బయటపడి వున్న రాళ్ళు , ఫలకాలు లభించాయి. అక్కడే బయ్యన్నగా పిలువబడే భైరవుని విగ్రహం మట్టిలో కూరుకుని పోయివుంది.







***టంగుటూరు:*** టంగుటూరులో సింహంగుర్తున్న విష్ణుకుండినుల రాగినాణేలు 787 లభించాయి. తెలంగాణం అంతా

విష్ణుకుండినులరాజు మొదటిమాధవవర్మ గెలుచుకుని పాలించాడని తెలుస్తున్నది.(మారేమండ రామారావుగారు ఆంగ్లంలోరాసిన గ్రంథ మాధారం)టంగుటూరులో వూరిబయట బీరప్పగుడిలో లింగాలుగా పూజింపబడుతున్న ఆదిమానవుల రాతిపనిముట్లున్నాయి.వూరిలో బడితూర్పున మైలారదేవుడు ,భైరవుడు, వీరగల్లులున్నాయి, పురాతన శివాలయాలున్నాయి.చెరువుకట్టదగ్గర కాటమయ్యవిగ్రహం , అమ్మదేవత లున్నారు.అనేకంగా శిథిలదేవాలయాల ఆనవాళ్ళు దొరుకుతున్నాయి. వూరిబొడ్రాయి దగ్గర సార్గమ్మరాతిబొమ్మ వుంది.ఇట్లాంటిబొమ్మ కర్రతోచేసింది తుర్కపల్లిమండలంలోని వీరారెడ్డిపల్లెలో వుంది. గ్రామంలోని హరిజనవాడలో ఆంజనేయునికి ఎదురుగా ఒకశాసనస్తంభం వుంది.దానికి నాలుగువైపుల ఈ శాసనంలో శిథిలాక్షరాలెక్కువగా వున్నాయి. రాజదండనాయక హళెకన్నడభాష లో తెలుగులిపిలోచెక్కిన శాసనం వుంది.

ఈ శాసనం చరిత్రలో కొత్తసంగతులు చెప్తున్నది. ఈ శాసనం కొత్తది. దీన్ని చదివి, రాయగలిగాను.

టంగుటూరు (అడ్డలూరు) శాసనం:

రాజవంశం: కళ్యాణి చాళుక్యులు

రాజుః (పేర్కొనబడలేదు. కాని. . . రెండవ తైలపుని పాలనాకాలం నాటిది)

కాలం: శాలివాహన శక సం. లు 914 , క్రీ. శ. 992 , వైశాఖ శుద్ధ తదియ గురువారం

భాషః తెలుగన్నడం

శకవర్షాలు 914(క్రీ.శ.992) , వైశాఖ శుద్ధ తదియ గురువారం నాడు వేయబడిన ఈ శాసనంలో అడ్డలూరు కామరాజు రేచయసేద్దియ

ధర్మకీర్తులకొరకు 2 మర్తురుల నీర్నేల ( wet land) సర్వపరిహారంగా, ఆచంద్రార్కంగా 4 మర్తురుల నేలను కార్తీకఫలం కొరకు పసలకేశునికి మరికొన్నిమర్తురుల భూమి ,7 ద్రమ్మాలు సిద్ధాయంగా మాణికేశ్వర ప్రభునికి దానమిచ్చినట్లు తెలియపర్చబడ్డది.

ఇది నల్గొండలో లభించిన రెండవతైలపుని కాలపు మొదటి శాసనం. శారాజిపేట, టంగుటూరు గ్రామాల మధ్యన అద్లూరుచెరువుంది. చెరువుకు ఉత్తరాన టంగుటూరువైపు పాటిగడ్డ వుంది. కొన్ని దేవాలయ శిథిలాలున్నాయి.అక్కడే లభించిన ఈ శాసనస్తంభాన్ని తెచ్చి టంగుటూరుప్రజలు హరిజనవాడలో ఆంజనేయుని ముందరనిలిపారు. దీన్నిబట్టి అడ్డలూరుఅనే గ్రామం చెరువులో వుండేదని అక్కడ పసలకేశుని గుడి,మాణికేశ్వరాలయముండేదని తెలుస్తున్నది.ఇక్కడికి దగ్గరలోనే మాణిక్యపురం అనే గ్రామముండడం విశేషం.

శాసనపాఠం:

మొదటి వైపుః

1. స్వస్తి స
2. క నృపకాల
3. తీత సంవ
4. త్సర సత
5. ద 914 నే
6. య నందన సం
7. వత్సరద వై
8. సాఖ సుద్ధ
9. తదీదేయు బ్రు
10. హస్పతి వా

11. ర దంద్రు 'అడ్డ
12. లూర కామ
13. రాజాంటప్పుతే
14. రేచయ సే
15. ద్దియ మగ

రెండవ వైపుః

16. వల్లియద
17. కాళేయంగ త
18. మ్మకీర్తియ
19. పుఱగే ఇ
20. మ్మత్త నీర్నేల
21. న సర్వ ప
22. రిహారయా
23. చంద్ర కామాది
24. యున్బీ అల్లి
25. నాల్క మత్త
26. నేలన కార్తీ
27. క ఫలదింకే
28. ఈపు బసల
29. కేశనీశవర

మూడో వైపుః

30. బసగి ల్వే
31. దకము కు
32. ప్పీయకేర

33. నిక వశేఇళ

34. కా మత్తర్గేళు

35. ద్రమ్మవ సి

36, ద్ధాయా మికి

37. ళిఙిద నేల

38. నృల్సముకళే

39. య కొ– –త్త

40. ర్గే–ద ద్రమ్మము

41. మానికేశు ప్రి

42. ఘూర్వ్యంచందాది

నాలుగో వైపుః

43. క్షుద్రబాదేమే

44. ను పాలసల్ల్స

45. బారనాసి ప్ర

46. యాగకరు క్షే

47. త్ర చేఇగపి

48. లలు వేవురు

49. తాపసులు

50. వేవురు బ్రాహ్మ

51. నులు ఇడ్తబ్బ

52. దేవర్గేకచ

53. క









***లక్ష్మక్కపల్లి:*** కొలనుపాకకు పడమటవుండే గ్రామం. ఈ గ్రామంలో పురాతన రామాలయం వుంది. అందులోనే లింగాలు , పానవట్టాలున్నాయి. ఎక్కణ్ణుండో తెచ్చిపెట్టినట్టుంది. రామాలయానికి ఎదురుగా పొలంలో భైరవుడు , వినాయకులను చెక్కిన రాతిపలకలున్నాయి. వూరి తూర్పున చిన్నమట్టిదిబ్బ. దానిమీద అడుగు

ఎత్తున్న ఆంజనేయుడు. అక్కడ గుడి ఆనవాళ్ళున్నాయి. వూరికి ఉత్తరాన మేకలబండ కానుకుని వున్న చెలకల్లో ఆదిమానవుల సమాధులు వందదాకా వున్నాయి. మేకలబండకు తూర్పున 'పెద్దగిలి' అంటే పెదవేగి కాదుకద. అర్థపరంగా చూస్తే ఎగిలివారంగ అంటే వెలుగులుపారంగ. . . సూర్యోదయాన అని వాడుక. కాని , ఆ చోటున పడివున్న దేవాలయపు కుడిశేరెడు, విరిగిన ఉత్తరాసి , అక్కడ దొరుకుతున్న ఇటుకలు. . . పూర్వమదొక గ్రామమై వుండాలని దానిపేరు పెదవేగి అయుండవచ్చును.







***సోమారం:*** నల్లగొండజిల్లా రాజపేటమండలంలోని ప్రాచీనగ్రామం సోమారం. ఈవూరి పాటిగడ్డలు మూడు చోట్ల కనపడుతున్నవి. ప్రస్తుతగ్రామానికి 3 కి. మీ. ల దూరంలో 'సిమ్ములోని పాటిగడ్డ ' అనే ప్రదేశంలో శాతవాహనుల కాలంనాటి ఇటుకలు , మట్టిపాత్రలపెంకులు,

మట్టిపూసలు,(హరప్పా,మొహంజదారోతవ్వకాల్లో బయటపడినటువంటి) అమ్మదేవత టెర్రకోటబొమ్మ లభించాయి. వ్యవసాయంలో ఇపుడా స్థలమంతా ఆనవాళ్ళను కోల్పోతున్నది. సిమ్ములోడు అంటే సిముకుడు అంటే శ్రీముఖుని (శ్రీముఖ శాతకర్ణి) పేరుమీద ఏర్పడ్డ ఈ గ్రామం అతి ప్రాచీనమైంది. తొలి శాతవాహన చక్రవర్తి పేరుమోసిన వూరు పాటిదిబ్బయి పోయింది. ఆనవాళ్ళను వెలికితీసే పని చేయకపోతే ఒక ప్రాచీన చరిత్ర కాలగర్భంలో కలిసిపోతుంది. వూరికి 1కి. మీ. దూరంలో పాతకోట అని పిలిచే పాతవూరడుగు వుంది. అక్కడ కోటగోడల శిథిలాలు, ఆంజనేయుడు, పోచమ్మగుడి వున్నాయి. వూరిలో చండికాంబ సహితశివాలయం,అందులో వినాయకులు ,లింగాలు, హనుమంతు డున్నారు.గుడికిదక్షిణాన కోనేరుంది.ఈవూరిలో నిజాంకాలంనాటి మట్టి , రాతిగోడలగడి వుంది.లోపల శిథిలమైనఇల్లుంది. చతురస్రాకారపు రాతివరలతో కట్టిన బావివుంది. 400యేండ్ల కింద నిజామాబాద్ జిల్లా కామారెడ్డి ప్రాంతపు రైతులను ఇక్కడికి రప్పించి వారిచేత తమభూములను నిజాం సేద్యంచేయించాడని ఆవూరిరైతు కీ. శే. రాజిరెడ్డిగారుచెప్పారు.

  

*దూది వెంకటాపురం:*

సోమారంవూరికి దక్షిణాన వాగు (ఆలేరువాగులో కలిసే ప్రవాహం) అవతల దూది వెంకటాపురంఅనే వూరుంది. వాగొడ్డున మట్టిదిబ్బతొలగిస్తే

శివాలయం శిథిలాలు , నంది, శాసనం బయటపడ్డాయి. శాసనం శిథిలస్థితిలో వుంది. వూరిబయట ఎత్తులేని చిన్నబండసొరికెలో నరసింహస్వామి వెలిసాడని పూజిస్తున్నారు. బయట రాళ్ళ ప్రహరి , ఆలయరక్షకులుగా ఆంజనేయుడు, గరుత్మంతులున్నారు.







***రాజపేటః*** రాజపేట సంస్థాన్ నారాయణపురానికి చెందిన రాజారాయన్న కట్టించినకోటవున్న పట్టణం. 5 కి. మీ. ల విస్తీర్ణంలోవున్న ఈవూరిలో కోట , కోటచుట్టు కందకం , కోటలో అద్దాలమేడ , అందాల అంతఃపురం, రాజాస్థానం, గుర్రాలుతిరిగే కోటప్రహరిగోడ , నీటిసరఫరా ఏర్పాటు, ఫౌంటెన్లు,శివాలయం వున్నాయి. వూరిలో సంగమేశ్వరాలయం, వెంకటేశ్వరమఠం(రాజపేట సంస్థానాధీశుడు రాజా వెదిరె వెంకట నారాయణరావు బహద్దూర్ వెంకటేశ్వరమఠం పోషణకొరకు మఠానికి

చెందిన బైరాగిషాకిరుదాసుకు 1782లో దానపత్రమిచ్చాడు) , మార్కండేయునిగుడి, సత్యనారాయణదేవాలయం, పుట్టహనుమాన్ గుడి , పోచమ్మగుడి, కట్టమైసమ్మగుడి, ముత్యాలమ్మగుడి, మల్లన్నగుట్ట మీద మల్లిఖార్జునస్వామి,అవతల బండమీదిదోపు జరిగే హనుమదా లయాలున్నాయి. మల్లన్నగుట్టప్రాంతం ఒకప్పటి ఆదిమానవుల ఆవాసం. అక్కడ నవీనశిలాయుగం నాటి రాతిపనిముట్లు లభిస్తున్నాయి.

 

 

***నమిలెః*** నెమిల లేదా నమిలె రాజపేట , వెంకటాపురాల మధ్య వుంది. ఈ గ్రామంలో శివాలయాలు , చెన్నకేశవదేవాలయాలున్నాయి. రాష్ట్రకూటులశిల్పశైలితో సప్తమాతృకల శిల్పపట్టిక ఇక్కడ ప్రత్యేకం. ఇటీవల బయటపడ్డ మనిషినిలువెత్తు గణపతివిగ్రహం వుంది. ఈ ప్రాంతంలో రాష్ట్రకూటులనాటి గాణపత్యం ఇక్కడకూడా విస్తరించి

వుందనడానికి,రాష్ట్రకూటులీప్రాంతాన్ని పాలించారని చెప్పడానికి గణపతులు సాక్ష్య మిస్తున్నారు.ఈవూరికి కొంతదూరంలో పాటిగడ్డ వుంది.అక్కడ తవ్వకాలుజరిపితే చారిత్రకాధారాలు దొరుకుతాయని నమ్మకం. ఈ నెమిలె 'నేమి'నాథుని పేరన ఏర్పడ్డ వూరేమో.







***రఘునాథపురం.***రాజపేటమండలంలోని రఘునాథపురం గ్రామం ఒకప్పటి జైనబసదులున్న చారిత్రకప్రదేశం.రఘునాథపురం ఆలేరుకు సరిగా 10కి. మీ. ల దూరంలో వున్నది.విష్ణుకుండినుల ఏలుబడినుండి కాకతీయుల పాలనదాకా ఆవూర్లో కట్టించిన ఆలయాలు , శిల్పాలు రఘునాథపురం చరిత్రను వివరిస్తున్నాయి.

రఘునాథపురం నుండి వయా గౌరాయపల్లి ద్వారా వెళ్ళే రోడ్డుమార్గంలో రఘునాథపురం వూరు దాటగానే రోడ్డుకు దక్షిణంవైపు రోడ్డుకు అంచునవున్న మట్టిలో రెండు విరిగినజైనశిల్పాలు పడివున్నాయి. అందులో ఒకటి తలలేని ఆసనస్థితిలోవున్న నాలుగడుగులఎత్తున్న జైనమహావీరుని విగ్రహం ,రెండవది నడుమునుండి మెడవరకు

మూడడుగులుమాత్రమేవున్న మరొకజైనశిల్పం.బహుశః అది నేమినాథునిదై వుండవచ్చు.అక్కడికి పదడుగులదూరంలో ఒకప్పుడు గుడిశిథిలాలుండేవని గ్రామస్తులు చెపుతున్న చోటున్నది. అక్కడే కీసరలో దొరికిన ఇటుకలవంటివి గట్టిగా కాల్చిన ఎర్రని , 8అంగుళాల వెడల్పు , 16 లేదా21 అంగుళాల పొడవుండి 4అం. ల మందం వున్న రెండు , మూడు ఇటుకలు పడివున్నాయి.

అక్కడ రోడ్డవతలవున్న మామిడితోటలో 40అడుగుల లోతున్న పురాతనమైనబావివుంది. దానికి పడమటి అంచున పొలంలో 9అడుగుల ఎత్తైన వీరగల్లుంది. దానిపైన శిథిలాక్షరాలలిపి వుంది. ఆలేటివాగులో కలిసే రఘునాథపురంవాగుకు దక్షిణాన చిన్నఒర్రెకాలువ పక్కన పాటిగడ్డ, పాటిగడ్డలో హనుమాండ్లు, పాతవూరడుగు పెంకులు, ఇటుకలు, రోళ్ళతో నిండివుంది. కొన్నినిజాంకాలంనాటి ముస్లింలసమాధులున్నాయి. అక్కడ ఒకచోట ఇనుముచిట్టెం ,ఇనుపపరిశ్రమవున్నట్లు ఆనవాలుగా బూడిదనిండిన నల్లని మట్టినేల వుంది.

గ్రామంలోవున్న శివాలయం (కొత్తగా రామాలయం కూడా) అతిపురాతన శైవమఠం.శివాలయపు అంతరాళం ఉత్తరాశికి లలాటబింబంగా ఏనుగులుఅభిషేకిస్తున్న శివలింగం చెక్కివుంది. ఇట్లాంటి ఆలయనిర్మాణాలు కీసరలోకూడా వున్నాయి. నిజానికి ఈచిన్నశివాలయం త్రికూటదేవాలయం.తూర్పు అభిముఖం గావున్న గర్భగుడిలో చతురస్రాకారపు పానవట్టంపై శివలింగం , దానిపక్కన తర్వాత కాలంలో ప్రతిష్ఠితమైన జంటనాగుల నాగబంధశిల్పం , వెనక చిన్నవినాయక విగ్రహం వున్నాయి.గర్భగుడిలో పైకప్పుకు అష్టదళపద్మాన్ని గర్భీకరించుకున్న అష్టకోణయంత్రం చెక్కబడివుంది. ఎదురుగా రాష్ట్రకూటులకాలంనాటి నందివిగ్రహం వుంది. దక్షిణంలోని

ఉపాలయంలో వీరభద్రుడు , వీరభద్రుని ఉపాలయద్వారానికి కలశాలు చెక్కివుండడం విశేషం.కలశం జైనాలయాల చిహ్నం.ఉత్తరంగావున్న ఉపాలయంలో దుర్గలు ప్రతిష్టించబడి వున్నారు.ఇటువంటి మనోహరమైన వీరభద్రునిశిల్పం రాజపేటమండలంలోని పాముకుంట గ్రామంలోకూడా వుంది.గుడిబయట మూడు వినాయకశిల్పాలు సుందరంగా వున్నాయి. రెండడుగుల ఎత్తు ,నాగబంధం,ఒక చతుర్భుజగణపతిశిల్పం , 4 అడుగులఎత్తు, రెండుచేతులు, నాగకిరీటం, జందెంవున్న మట్టిరంగురాతి వినాయకశిల్పం, మూడో వినాయకుడు 2అడుగుల ఎత్తుంది. శిల్పాన్ని బట్టి ఈనాలుగు వినాయకశిల్పాలు ఒకేకాలానికి చెందినవి కావనిపిస్తున్నది.విష్ణుకుండినులు,చాళుక్యులకాలంలో చెక్కినవి. ఆలయ ప్రాంగణంలో చెన్నకేశవుని శిల్పం వుంది. విగ్రహశీర్షానికి అంచున దశావతారాలు చెక్కివున్నాయి. ఈశిల్పం వీరభద్రుని శిల్పరీతులతో పోలి, అందంగా వుంది. ఆలయపాలకుడిగా భైరవుడున్నాడు. చతుర్భుజుడు , నగ్నదేహం, పేగుల జందెం, చేతులలో పిడికత్తి, కొంగకాలుకత్తి, గొడ్డలి, రక్తపాత్రలతో భయంకరంగా వున్నాడు కపాలభైరవుడు.

ఒక వినాయకునిపక్కనవున్న శిథిలశిల్పం లోహసంబంధమైన రాతితో చెక్కినట్లుంది. వాతావరణానికి శైథిల్యం పొందింది. ఈ శిల్పం వంటిది ఆలేరుపోచమ్మగుడిలో వున్న శైవాచార్యుని విగ్రహంతో పోలివుంది.అంటే రఘునాథపురంలో కూడా కాపాలికులుండేవారని , జైనబసదిని,విగ్రహాలను వారే కూల్చివుంటారని అనుకోవడానికి వీలున్నది.

గ్రామానికి తూర్పున 1కి. మీ. దూరంలో రామస్వామిగుట్ట అని పిలువబడే చిన్నరాతిబోడుంది.దానిమీద పురాతన రామలింగేశ్వ రాలయముంది.దాని పక్కన శాతవాహనులకాలంనాటి ఇటుకలతో కట్టినట్టుగా రెండుభవనాల పునాదులున్నాయి. గుట్టచుట్టు ప్రాచీన

మానవుల సమాధులు అనేకం వున్నాయి. కైరన్లు , సిస్తులు, డోల్మన్లు రకాలున్నాయి. రాతిగొడ్డళ్ళు, రాతికత్తులు, బొరిగెలు, గీకుడురాళ్ళు వంటి రాతిపనిముట్లు దొరికాయి.

గుట్టకు తూర్పున ఒకరాతిగుండుకు బుద్ధుడు శివలింగాన్ని తన్నుతున్నట్లుగా చెక్కివుంది. నాగార్జునసాగర్ లో ఒక రాజు శివలింగాన్ని తన్నుతున్నట్లు చెక్కిన స్తూపఫలకాల శిల్పాలున్నాయి. కాని, ఇట్లా బుద్ధుడున్న బొమ్మ ఎక్కడాలేదు.









*కాసారం:*

యాదగిరిగుట్ట మండలానికి చెందిన కాసారం ఆలేరుకు 5కి. మీ. ల దూరంలో వుంటుంది. ఈవూరు వేలాదియేండ్ల నుండి ఆదిమానవుల ఆవాసమై వర్ధిల్లింది. గ్రామానికి దక్షిణాన క్వారీకొడుతున్న గ్రానైట్ పరుపుబండ వుంది. దానికి పెద్దబండ అని పేరు. ఆ బండకు ఉత్తరాన

కిందనే సొరికెలున్నాయి. అందులో చిన్నగుహలెక్క అనిపించేచోట బండరాయికి మిడికనుగుడ్లు , బండముక్కు, మీసాలతో తల ఆకారం చెక్కివుంది. ఎదురుగా (6 , 7 శతాబ్దాల నాటి) చిన్ననంది విగ్రహం , చివికిపోయిన చిన్న పావుకోళ్ళు (మునులు , స్వాములకు చిహ్నం) వున్నాయి. స్థానికులు లక్ష్మినర్సింహస్వామిగా ఆరాధిస్తున్నారు. కాని , పరిశీలించి చూస్తే అది భైరవునితలగా గుర్తించవచ్చు. ఇక్కడి గ్రామాలలో శివాలయాలు, భైరవవిగ్రహాలు, శైవమతాలుండడాన్నిబట్టి కాపాలికులు , పాశుపతులు, లకులీశులు ఈప్రాంతంలో వుండేవారని విశదమౌతున్నది. బౌద్ధ, జైనమతాలకు వ్యతిరేకంగా వారిబసదులు , ఆరామాలను ధ్వంసం చేసేవారని చరిత్రలో వుంది. భైరవారాధన తామసమైనది. రక్తం , బలులు ఎక్కువ. పెద్దబండ అట్లాంటిదే అని చెప్పొచ్చు.

పెద్దబండనుండి కొంచెం ముందుకుపోతే అక్కడ 18అడుగుల ఎత్తైన రెండునిలువురాళ్ళు కనిపిస్తాయి. ఇవి ఆదిమానవుల సమాధుల స్మశానానికి స్మారక శిలలు. వీటినే ఫ్రెంచిభాషలో 'మెన్హర్లు' అంటారు. ఇట్లాంటివి జనగామ దగ్గర కళ్ళెం గుట్టల కింద , వడ్లకొండ మల్లన్నగుట్ట దగ్గర, ఆలేరు దగ్గర ఇక్కుర్తిలో అగుపిస్తాయి. ఆలేరుకు ఎటు 30 కి. మీ. ల పరిధిలో ఆదిమానవుల ఆవాసాలు , సమాధులు వందలాదిగా అగుపిస్తున్నాయి. ఈ మెన్హర్లున్న జాగాలో , పెద్దబండ కింద వారి రాతిపనిముట్లు లభిస్తున్నాయి. వాటి తయారీ , వాడినరాళ్ళు, మొరటు, నునుపు దనాలను పరిశీలిస్తే ఇవి వేర్వేరుగా పాతరాతి (ఇప్పటికి 40వేల యేండ్లు) యుగం , మధ్యశిలాయుగం (ఇప్పటికి 10వేల యేండ్లు) , కొత్తరాతియుగాలకు (ఇప్పటికి 3వేల యేండ్లు) చెందినవిగా తెలుస్తున్నది. అంటే వేర్వేరుకాలాల్లో ఇక్కడ ఆదిమానవులజీవనం , సంచారం వుండేదని రుజువవుతున్నది.

కాసారం గ్రామంలో పురాతన శివాలయం వుండేది. దానినిపుడు పునర్నిర్మాణం చేసి పాత ఆనవాళ్ళు లేకుండా చేసారు. గుడిబయట పడేసిన గుడి అంతరాళం ఉత్తరాశిపై త్రిశూలం గుర్తుండడం చాలా విశేషం.ఇంతవరకు ఇట్లాంటి చిహ్నమేగుడిలో చూడలేదు. త్రిశూలధారులైన పాశుపతులమతానికి చెందిన ఆలయమయి వుంటుందేమొ. గుడిలోని పెద్దశివలింగం 1అడుగువ్యాసంతో అడుగున్నర ఎత్తుతో వుంది. అప్పటి శివాలయపు స్తంభాలు , మంటపం ఏదీలేదు. గుడిముందర పాతనాగశిల్పం వుంది. ఆ పక్కన కుడితొడ భగ్నమై యున్న చాళుక్యులశిల్పరీతితో, నల్లరాయిలో చెక్కిన మూడడుగుల పెద్ద వినాయక శిల్పం వుంది. శివాలయం పక్కగా బాటఅవతల అమ్మవారి ఆలయముంది. దాని అంతరాళానికి త్రిశూలమే లలాటబింబంగా వుంది.

 

  

*చినకందుకూరుః*

యాదగిరిగుట్ట మండలానికి చెందిన ఈవూరు చాలా ప్రాచీనమైనది. ఇక్కడ నాగులకుంట దగ్గర కంచెలబాయి చెలకలో కాకతీయ గణపతిదేవ చక్రవర్తి కాలం నాటి శాసనం దొరికింది. దానిని నేను , విరువంటి గోపాలకృష్ణగారు కలిసి పరిష్కరించి శాసనపాఠాన్ని సాధించాం.

చిన్న కందుకూరు శాసనం: రాజుః కాకతి గణపతిదేవ చక్రవర్తి క్రీ.శ.1242–శుభకృత్ నామ సం. పౌష్య శుద్ధ ఏకాదశి శనివారమునాడు (చిన్న) కందుకూరి ఎక్కటీలు (సైనికులు) చాకికుంట వెనుకవున్న రామేశ్వర దేవాలయానికి, భోగనాథదేవాలయానికి నైవేద్యానికై ' 1 అడ్డా (సగం రూపాయి) ,ఇరుకార్తెలపంటను దానంగా ఇచ్చినట్లు ' రాయబడివుంది.

శాసనపాఠం:

1. ప్రశస్తి సహిత
2. స్వస్తి సమస్త శ్రీమ్మ మండ
3. లేశ్వర కాకతీయ గణ
4. పదేవ మహీరాజులు
5. సుఖసంగతి వినోదం
6. బుగా ప్రిథివి రాజ్యంబు
7. సేయుచుండగా శుభక్రు
8. తు సంవత్సర పౌష్య శుద్ధ ఏ
9. కాదశి వొడ్డెవారము నాం (డు)
10. కందుకురి ఎక్కటిలు ఎఱ
11. వ్వెమానిసి చాకి కుంటెనుక
12. రామేశ్వర దేవరకు భోగనాథ
13. దేవరకు నివేద్యనకు అడ్డ

14. ఇరుకార్త్య పన్టను ఇచ్చిరి

తర్వాత దానశ్లోకం వుంది.

ఇట్లా ఎక్కటీలు కాకతీయుల కాలంలో కట్టినవి మరి రెండు అంతకన్నా ఎక్కువే వున్నట్టు శాసనాల వల్ల తెలుస్తున్నది. రుద్రదేవుని కాలంలో మెదక్ జిల్లా కొండపాక గ్రామంలో ఎక్కటీలే రుద్రేశ్వరాలయాన్ని నిర్మించారు. వరంగల్ జిల్లా ఆకునూరులో కూడా రుద్రదేవుని కాలంలో ఎక్కటీలు నిర్మించిన దేవాలయాన్ని గణపతిదేవుడు దర్శించి దానాలిచ్చాడు. ఈ గ్రామంలో పురాతన శివాలయం నాగులకుంట వద్ద శిథిలమైవున్నది. భోగనాథ దేవాలయం లేదు , కాని నాగశిల్పాలు చెరువుకట్టకు వున్నాయి. వూరిలో పురాతనశివాలయముంది.

  



***ముస్త్యాలపల్లిః***

సైదాపురం శాసనంలో పేర్కొన్న ముచ్చెనపల్లి(ఆత్మకూరు (ఎం) మండలంలోనిది)ఇదే.ఈ గ్రామానికే అగ్గలయ్య గావుండగా

(గ్రామాధికారి) వున్నది.మాసాని ఒర్రె ,చిన్నవాగు (భిక్కేరు)ల మధ్య దీవిలా వున్న వూరు. ఇక్కడి ప్రాచీన దేవాలయాల ఆనవాళ్ళు లేకుండా పునాదుల్లో వేసి కొత్తగుళ్ళు కట్టారు.పాత శివాలయమే బహుశః జైనబసది కావచ్చు. ఇక్కుర్తి జైనబసది శివాలయమైనట్టు ఇక్కడ కూడా అట్లే జరిగివుండవచ్చు. ఈ వూరిలో దక్షిణాభి ముఖుడైన హనుమంతుడు , మార్కమ్మ, పోచమ్మలు, కాటమయ్యల గుళ్ళు వున్నాయి.




**చాడః**

చాడ ఆత్మకూరు (ఎం) మండలంలోనిది. భిక్కేరు ఒడ్డున వెలసిన భౌద్ధస్తూపం, చైత్యాలు, ఆరామాలతో క్రీ. శ. 1వ శతాబ్దం నుండి 7వ శతాబ్దం దాకా బౌద్ధమతప్రాభవం విలసిల్లిన గ్రామం. ఆ తర్వాత రాష్ట్రకూటులు, కళ్యాణీ చాళుక్యలు , కాకతీయుల కాలాలలో ఈ గ్రామం గొప్పగా వుండేది. ప్రస్తుతం ఈవూరి పెద్దబడిలో వున్న శాసనం (Inscriptions of A. P. Nalgonda Dist. Vol. I, No. 17, p:46)చాళుక్యచక్రవర్తి త్రిభువనమల్లుని చేత కొలనుపాక-7000ల నాడుకు సామంతుడిగా నియమింపబడిన కామభూపుడు(కుమార కామరసర్) చిడెయ(చాడ)లోని మల్లేశ్వరదేవునికి త్రిభోగాభ్యంతరసిద్ధిగా 'మానుగల్'గ్రామాన్ని దానం చేసినట్లుగా తెలియచేస్తున్నది. ఈ గ్రామానికి సరిహద్దులు తూర్పున పల్లేరు (పల్లెర్ల) ,దక్షిణాన వేముల(కొండ) ,

పడమరన మొగలిపాక, ఉత్తరాన నేత్రకల్లు (నకిరెకల్) గా చెప్పబడ్డాయి. ఇక్కడి గుడి ఒక ద్వికూటాలయం. పడమటి గర్భగుడిలో శివలింగం , దక్షిణాన గుడిలో శూన్యమే వున్నది.ఆ గుడిలో ఏదేవుడుండెనో? గుడి ఆవరణలో నిర్మించిన కొత్తగుడిలో వీరభద్రుడున్నాడు. అందమైన కాకతీయశిల్పం. గుడిబయట వీరగల్లులు , వల్లీసమేత సుబ్రమణ్యస్వామి శిథిలశిల్పం వుంది. గుడివెనక కోనేరు వుంది. దూరంగా మరొక రామసముద్రం అనే కోనేటిబాయి వుంది. దానికి ఆవలనే బౌద్ధస్తూపం , బుద్ధుని విగ్రహం దొరికాయి. దానికి పైన ముత్యాలమ్మ చింతలు, అక్కడికి అర కిలోమీటరు దూరంలో పాతవూరి పాటిగడ్డ వుంది. అక్కడే మాకు శాతవాహనకాలంనాటి గాజుపూస , పెంకుబిళ్ళ దొరికినవి. ఇటుకలైతే కుప్పలు తెప్పలు. అంటే ఈ వూరు శాతవాహనుల కాలం కంటె ముందునుండే వుండేదని తెలుస్తున్నది.









***బోనగిరి ఖిలా:*** జానపదుల పేరుమీద ఒక దుర్గం , ఒక నగరం ఏర్పడ్డది చరిత్రలో ఎక్కడైనా వుందో లేదో కాని బోనగిరిఖిలా వుంది. అనగనగా ఒక రాజు. ఆ రాజు ఇప్పటి రాయగిరి రైల్వేస్టేషన్ (ఒకప్పటి తిరుమలగిరి తండా) దగ్గరి మల్లన్నగుట్ట మీద కోటను చూసి బోనయ్యనే గొల్లాయన 'ఈడ కోటేం కద్దరుగని మీకు మంచి జాగ జూపిస్త రమ్మ 'ని తీసుకపోయి బోనగిరిగుట్టను చూపెట్టిండంట. దాని మీది కప్పివున్న తీగెలపొద మొదలు హనుమపురం దాకుండెనట. దాన్ని నరికి రాజుకు గుట్ట చూపెడితే రాజు రాయిగిరిలో కోటకట్టుడాపి బోనగిరిగుట్ట మీద ఖిల్లా కట్టిండట. రాజు ఇనామిస్తనంటే బోనయ్య తనపేరు , తనభార్యపేరు గిరమ్మ కలిసొచ్చేటట్ల ఊరు కట్టియ్యమన్నడంట. రాజు తథాస్తన్నడు. బోనయ్య, గిరమ్మల పేరుమీద 'బోనగిరి'ని కట్టించిండు రాజు. ఆ బోనగిరే సంస్కృతీకరించబడి ఇపుడు భువనగిరిగా పిలువబడుతున్నది. ఇది జానపదుల కథే. దీనికి చారిత్రకసాక్ష్యం లేదు. కాని , భువనగిరికోటే చరిత్రకు సాక్ష్యం. నల్గొండ జిల్లా కేంద్రానికి 71 కి. మీ. దూరంలో , హైద్రాబాద్ కు 47 కి. మీ. ల దూరంలో భౌగోళికంగా 17. 0523 డిగ్రీల ఉత్తరఅక్షాంశం,79.2671డిగ్రీల తూర్పురేఖాంశంపై వుంది భువనగిరిపట్టణం. భువనగిరికొండ ఎత్తు 610 మీటర్లు. అండాకారపు ఏకశిలాపర్వతం ఈ కొండ. దీన్ని దక్షిణం నుండి చూస్తే తాబేలులాగా , పడమటి నుండి చూస్తే పడుకున్న ఏనుగులాగా అగుపిస్తుంది. ఈ కొండ బాలాఘాట్ పర్వతపంక్తులలోని అనంతగిరి వరుసల లోనిది. ఈ కొండమీదనే భువనగిరిదుర్గమున్నది. ఇది తెలంగాణాలోని ఉండ్రుకొండ , ఉర్లుకొండ, అనంతగిరుల కంటె ఎత్తైనది. ఈ కోటకు నైరుతి , ఆగ్నేయ దిశల నుండి పైకి వెళ్ళే మార్గాలున్నాయి. ప్రస్తుతమార్గం నైరుతి నుండే ప్రారంభమవుతుంది.భువనగిరిలో, దాని పరిసరాల్లోని రాయగిరి వంటి

చోట్ల మధ్యపాతరాతియుగం(క్రీ. పూ.50000-23,000) నాటి మానవ ఆవాసచిహ్నాలు న్నాయి. రాతిగొడ్డళ్ళు , కత్తులు, బొరిగెలు, బాణాలువంటి రాతిపనిముట్లు లభించాయి.సమాధులు కూడా కనుగొనబడ్డాయి.

భువనగిరిలో మధ్యరాతియుగం(క్రీ.పూ. 8,000- 2500) నాటి మానవనివాసజాడలు లభించాయి. నవీనశిలాయుగం (క్రీ. పూ. 2500-1800)నాటి మానవ ఆవాసాలు భువనగిరికొండ కింద వున్నాయి. కొండ ఎక్కే మెట్లదారికి మొదట్లోనే ఎడమవైపున కొద్దిదూరంలో ఒకచిన్నరాతిగుండ్లగూడు వంటిది వున్నది.దానిలో ఉత్తరందిశలో వున్న రాతిగుండుపైన పదునైన పనిముట్టుతో తొలిచిన చుక్కలవంటి గుర్తులు 52 వున్నాయి.ఇవి 5వరుసల్లో స్పైరల్ గీతలున్నాయి.ఇవి ఏ పురాతనమానవుని కళాత్మకసృష్టో?ఇలాంటి రాతితొక్కుడుబొమ్మలు తెలంగాణలో పూర్వమానవుని ఆవాసాల్లో,రాతినెలవుల్లో కనిపిస్తున్నాయి. ఇది ఏ నక్షత్రమండలంవలె లేదు.భువనభాండం కాదు.రాతికళ( Rock Art)ను వ్యాఖ్యానించే పండితులే అర్థం చెప్పాలి వీటికి. భువనగిరిలో మధ్య,చివరి పాతరాతియుగాలనుండి కొత్తరాతియుగం వరకు రాతిపనిముట్లు దొరికాయి. కాబట్టి, ఈ రాతితొక్కుడుబొమ్మ చివరిరాతి యుగం నాటిదై వుంటుంది.ఇట్లాంటివి కరీంనగర్ జిల్లా నర్ర ఏశాలపల్లిలో ఠాకూర్ రాజారాంసింగ్ చూసిన రాతితొక్కుడుబొమ్మ( Rock Bruisings)లతో పోల్చదగినది. భువనగిరిలో రైలుకట్ట వెంట దిగువకు రాయగిరి దాకా , పైకి బీబీనగర్ పై వరకు అక్కడక్కడ సిస్తులు , కైరన్లు అగుపిస్తున్నవి. వీటిని పరిశోధిస్తే ఇంకా కొత్తచారిత్రకవిషయాలు బహిర్గతమయే అవకాశముంది. భువనగిరికి దగ్గరగా ఆలేరునది (భిక్కేరు),మూసీనదులున్నాయి.భువనగిరికి వాయవ్యాన భువనగిరి చెరువుంది.చెరువుకు బీబీనగరుచెరువు గొలుసుకట్టు చెరువు. అక్కడనుండి

కట్టుకాలువ వుంది.కీ.శే.ఆదిరాజు వీరభద్రరావుగారు రాసిన 'ప్రాచీనాంధ్ర నగరాలు'లో భువనగిరిదుర్గం 3వేలఏళ్ళ క్రితం నుండి వున్నదని ఒక పారశీకప్రతిలో రాసున్నదని తెలిపారు. 1898లో అచ్చయిన 'Glimpses of the Nizam's Dominionsలో CampBell భువనగిరికోట గూర్చి రాసాడని నిఖిలేశ్వర్ గారొక వ్యాసంలో పేర్కొన్నారు. భువనగిరి నగరానికి చుట్టూ మట్టిగోడలు, 3ద్వారాలుండేవట. ఇపుడు మట్టిదిబ్బలే ఆనవాళ్ళుగా మిగిలివున్నాయి. భువనగిరికోట మొదటిద్వారాన్ని 'ఉక్కుద్వార'మంటారు. ఈ ద్వారాన్ని నిజాం తన సొంతఖర్చుతో నిర్మించినట్లు ప్రతీతి. అందువల్ల ఇది కొత్తద్వారమై వుంటుంది. క్రీ. శ. 1900ల ప్రాంతంలో ప్రతి ఉదయం ముగ్గురు వాద్యగాళ్ళు తమవాద్యాలను వినిపించేవారట. ఈ ప్రవేశద్వారం గోల్కొండకోటలోని 'బాలాహిస్సార్' మొదటిద్వారం ఫతేదర్వాజా లాగే వుంటుంది. తలుపులు వెడల్పైన చెక్కలతో, ఇనుపగుబ్బలతో గజంపొడుగు బేడాలతో నిర్మించబడినది.రెండోద్వారం గుళ్ళోని చౌకోటులెక్క వుంటుంది.పనితనం కనిపిస్తుంది.మూడోద్వారం సాధారణం. అక్కడే వెనకటి మసీదుండేదని కాంప్ బెల్ రాసాడు.నాలుగోద్వారం కూడా సామాన్యంగానే వుంది. బేడాలరంధ్రాలు గోడల్లోకి వున్నాయి. ఈ ద్వారం దాటి పైకిళ్ళితే ఒక కొలను కనపడుతుంది. నీళ్ళున్నపుడు అందులో తెల్లకలువలు విరబూసి కనపడుతుంటాయి.

పై ఎత్తుకి శిఖరానికి చేరినపుడు అక్కడ రాజభవనాలు , అంతఃపురం (బారాదరి)కనిపిస్తాయి. అంతఃపురంలోనికి మెట్లు లేవు. ఎత్తైనగోడలు,విశాలమైన గదులు ,ఇస్లాం సంస్కృతి నిర్మాణశైలిలో వున్నాయి. పైన గచ్చు నమాజుకు వీలుగా మసీదులాగా కనిపిస్తుంది. ఈ అంతఃపురం గోల్కొండ బారాదరిని పోలివుంటుంది.

బారాదరికి పడమట లోతుతెలియని 'ఏనుగుల మోటబాయి' (గుండం) వుంది. తోడిన నీళ్ళు నిలువచేసుకోవడానికి బారాదరికానుకుని 9తొట్లు (హౌసులు)కట్టివున్నాయి. పరిసరాలను పరిశీలిస్తే బారాదరికి ఉత్తరాన ఒక నల్లని నందివిగ్రహం వుంది. శివలింగం , గుడిలేవు. అంతదూరాన ఆంజనేయుని శిల్పం వుంది. రాజప్రాసాదాల వద్ద చాళుక్యులశిల్పరీతిని ప్రతిబింబించే నాలుగురేకుల పుష్పాలంకారాలు , ఏనుగుముఖాల్లోంచి సర్పాకారాలు, కాకతీయశైలిలో మకరతోరణాలు , ద్వారపాలకులు, గజలక్ష్మి చెక్కబడివున్నాయి.బోనయ్య కథ లోని బోనమ్మ (భువనేశ్వరీదేవి) గుడి కనిపించదు. కాని గుట్టకింద లోయల్లో పడివున్న దేవాలయశిథిలాలు కొండపైన ఒక అపురూపమైన దేవాలయం వుండి వుంటుందని సాక్ష్యమిస్తున్నాయి.కోటలోపల ప్రాకారాల్లో ధాన్యాగారాలు , సైనికాగారాలు,గుర్రపుకొట్టాలున్నాయి.రాజప్రాసాదాల కింద ఎన్నో అంతుతెలియని రహస్య శిలాగర్భమార్గాలు న్నాయి. ఈ సొరంగాల తొవ్వలు ఎక్కడికి తీసుకెళ్తాయో ఎవరు కనుక్కోలేకపోయారు. కోటలో పడివున్న ఫిరంగులు ఎనిమిది.మరికొన్ని కొండకిందలోయల్లో పడిపోయివుంటాయని స్థానికులు చెప్పారు.అందులో ఒకటి కుతుబ్షాహీలతో షితాబుఖాన్ (సీతాపతి)చేసిన యుద్ధంలో వాడిన ఫిరంగియని డి. సూర్యకుమార్ (చారిత్రకపరిశోధకులు)గారు రాసారు.

చరిత్రలో తెలంగాణాను ఏలిన అందరి ఏలుబడిలో భువనగిరిప్రాంతం వుంది.మూసీనది ప్రాంతాన్ని జయించిన మహాపద్మనందులు,ఆ తర్వాత మౌర్యులు, పిదప మహిషకుడు ఖారవేలుడి ఏలుబడిలో వుండి వుంటుంది భువనగిరి.శాతవాహనుల నుండి ఆసఫ్జాహీల దాకా వివిధరాజుల , రాజ్యాలలో భువనగిరి భాగమై వుంది. శాసనాల దాఖలా ప్రకారం క్రీ. శ. 1100 లకు ముందునుండే

భువనగిరిదుర్గం కళ్యాణీచాళుక్యుల పాలనలో వుంది.అపుడిది కొలనుపాకకు రక్షణ, సైనికదుర్గంగా వుండేది.

శాసనాధారాలుః

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 26వ శాసనం. . . పశ్చిమ చాళుక్యులు –త్రిభువనమల్లదేవుని కాలం– క్రీ. శ. 1105 ఏప్రిల్ 6వ తేది కొలనుపాక–7000నాడును మహామండలేశ్వరుడుగా పాలిస్తున్న పారమార జగద్దేవుడు భువనగిరిదుర్గ దండనాయకుడు ధక్కనాయకుని కొడుకు బమ్మదేవనాయకునిచేత నిర్మించబడ్డ మఠానికి, సోమేశ్వరదేవునికి అక్షయతృతీయ సందర్భంగా అంగరంగభోగాలకింద ఆలేరు కంపణంలోని 'గోష్టీపాలు' గ్రామాన్ని కానుకగా యిచ్చాడు.

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 34వ శాసనం. . . పశ్చిమ చాళుక్యులు– త్రిభువనమల్లదేవుని కాలం–క్రీ. శ. 1111. భువనగిరిలో దొరికిన శాసనంలో భువనగిరి దండనాయకుడైన లక్ష్మిదేవుడు (క్రీ. శ. 1111) పచ్చలకట్ట సోమేశ్వరదేవునికి నందాదీపం కానుకగా ఇచ్చాడు.

* నల్గొండజిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 38వ శాసనం. . . పశ్చిమ చాళుక్యులు– త్రిభువనమల్లదేవుని కాలం– క్రీ. శ. 1123 సం. శాసన వివరాల్లేవు.

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 39వ శాసనం. . . పశ్చిమ చాళుక్యులు– త్రిభువనమల్లదేవుని కాలం

భువనగిరికోట ద్వారం వద్ద రాతిమీద వున్నక్రీ. శ. 1123, శోభకృతు వైశాఖ అక్షయతృతీయ నాడు భువనగిరితీర్థంలోని సోమేశ్వరదేవునికి నూనెగానుగలవారు ఇవ్వవలసిన కానుకలను సుంక , సాహనవెగ్గడ, దేహారదాధినాయక వంటి బిరుదాంకితుడు సర్వాధ్యక్ష , దండనాయకుడైన

కేశియరసరు ఇప్పించాడు.

* నల్గొండజిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 41వ శాసనం. . .
పశ్చిమ చాళుక్యులు–త్రిభువనమల్లదేవుని కాలం
క్రోధన సం. ఎవరో మహామండలేశ్వరుడు. . వివరాలు లేవు.

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 43వ శాసనం. . .
పశ్చిమ చాళుక్యులు– త్రిభువనమల్లదేవుని కాలం
చందుపట్ల శాసనంలో చందుపట్ల (చంద్రపట్టణం) లోని విద్దేశ్వర దేవునికి విద్ధమయ్య దండనాయకుడు చేసిన భూదానాల గ్రామాలలో భువనగిరి పేర్కొనబడింది.

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 46వ శాసనం. . .
పశ్చిమ చాళుక్యులు– త్రిభువనమల్లదేవుని కాలం– సం. లేదు
భువనగిరిలోని భీమనారాయణదేవునికి భువనగిరికి అధిపతిగా వున్న దండనాయకుడు శోద్దాలయ్య ఏదో కానుక ఇచ్చినట్లు శాసనంలో చెప్పబడింది.

* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 43వ శాసనం. . .
పశ్చిమ చాళుక్యులు– ప్రతాపచక్రవర్తి– జగదేకమల్లుడు కళ్యాణి నుండి పాలిస్తున్న కాలం క్రీ. శ. 1146 సం. ఏప్రిల్ 15న భువనగిరిపాలకుడు సంధి, విగ్రహ సేనాధిపతి దేవుడి (పేరు లేదు) పూజాదికాలకు 4చిన్నాలు, 2 ద్రమ్మాలు, కొంతభూమి కానుకగా యిచ్చినట్లున్నది.
* నల్గొండ జిల్లా శాసనాలు– మొదటి సంపుటం– 50వ శాసనం. . .
పశ్చిమచాళుక్యులు–ప్రతాపచక్రవర్తి క్రీ. శ. 1147లో వేయబడిన బొల్లెపల్లి శాసనంలో భువనగిరి 'ప్రతిబద్ధం'గా ప్రభువు మేడియభట్టు బొల్లెపల్లిలో మైలారదేవుని ప్రతిష్ఠించారు.

* నల్గొండ జిల్లా శాసనాలు- మొదటి సంపుటం- 114వ శాసనం. . . భువనగిరిలో ఖాజీ ఇంటిముందరి రాయిపై వుంది. రేచెర్ల పద్మనాయక రాజైన అనపోతానాయకుని కుమారుడు భుజబలభీమ , సోమకుల పరశురామ, ఖడ్గనారాయణ బిరుదాంకితుడు సింగమనాయకుని పేరున్నది. క్రీ. శ. 1369ని ఐనవోలు శాసనం ప్రకారం అనపోతానాయుడు భువనగిరి దుర్గాధిపతి అని తెలుస్తున్నది. పద్మనాయకరాజులు భువనగిరిదుర్గాన్ని బాగుచేయించారు.
*నల్గొండ జిల్లా శాసనాలు-మొదటి సంపుటం- 129వ శాసనం. . కాలంలేదు. భువనగిరిలోని పీనుగుల దిబ్బ దగ్గర పడివున్న రాతిమీద శాసనం. ఎవరో 'బాటరాజు' పేరున్నది.

*ఇటీవల భువనగిరి సమీపగ్రామం వడపర్తిలో లభించిన కొత్తశాసనం కాలం:క్రీ. శ. 1156 సం. , రాజుఃజగదేకమల్లుడు-2 ఏలుబడిలో భువనగిరి దండనాయకుడు విద్ధమయ్య వడపర్తిలోని కందర్పేశ్వర దేవునికి చేసిన దానశాసనాన్ని నేను (వేముగంటి మురళీకృష్ణ , విరువంటి గోపాలకృష్ణలతో కలిసి) పరిష్కరించడం జరిగింది.

పై శాసనాలను బట్టి కళ్యాణీచాళుక్యులకాలంలో కొలిపాక-7000నాడు లోని ఆలేరు కంపణం- 40కి చెందినదే భువనగిరి. దీనిని కొలనుపాక ప్రభువుల దండనాయకులు లక్ష్మీదేవులు ,కేశియరసరు, విద్ధమయ్య,శోద్దాలయ్య,బమ్మదేవనాయకుడు, పేరుతెలియని మరికొందరు పాలించినట్లు తెలుస్తున్నది. కాకతీయుల కాలంలో గణపతిదేవచక్రవర్తి రుద్రమదేవి భర్త వీరభద్రునికి అరణంగా యిచ్చిన కొలనుపాకసీమలోనిదే భువనగిరి దుర్గం.కాకతీయుల సామంతుడైన గోనబుద్ధారెడ్డి ఏలిన మానువనాటిసీమలో భువనగిరి అంతర్భాగంగా వుండేది. కందూరిచోడుల పాలనలో భువనగిరి సైనికశిబిరంగా వుండేదని , వారే

ఇక్కడ ఆలయాలు, చెరువులు, ఇతర కట్టడాలు నిర్మించారని, భువనగిరిని విస్తరింపజేసారని ప్రముఖకవి ,విమర్శకులు డా.లింగంపల్లి రామచంద్ర గారు అభిప్రాయపడ్డారు.రేచెర్ల సింగభూపాలునికాలంలో క్రీ.శ. 1427లో బహమనీ సుల్తాన్ 2వ అహమద్షా ఓరుగల్లుముట్టడి పిదప దారిలోని భువనగిరిని స్వాధీనపరచుకొని 'సంజర్ ఖాన్ 'ను దుర్గపాలకునిగా నియమించాడు. భువనగిరికోట కుతుబ్ షాహీల పాలనలో చాలా యేండ్లున్నది.తర్వాత 1687లో మొగలులు గోల్కొండను ఆక్రమించినపుడు వారి యేలుబడిలోనికి పోయింది. సర్వాయి పాప న్న 1708లో ఓరుగల్లును గెలుచుకుని తర్వాత భువనగిరిని తన అధీనంలోనికి తెచ్చుకున్నాడు. అతని వీరమరణం అనంతరం మొగలులు, వారినుండి ఆసఫ్ జాహీల పాలనకిందకు వచ్చింది భువనగిరి దుర్గం.

భువనగిరి ఖిల్లా ద్వారానికి ఎదురుగా పడవేసివున్న శిల్పాలెన్నో వున్నాయి.కుమ్మరివాడలో అమ్మదేవతల గుళ్ళున్నాయి.ప్రాచీన దేవాలయాల అవశేషాలు అగుపిస్తున్నాయి. అక్కడొక గుడిదగ్గర సింహాస నారూఢుడైన వీరుని శిథిలశిల్పముండేది. అక్కడే ఒక చిన్న గుడిలో శయనస్థితిలో వినాయకుని విగ్రహం వుంది చాలా అరుదైన విగ్రహం. బ్రాహ్మణవాడలోని రామలింగేశ్వరాలయంలో 5 పడగల నాగశిల్పాలు, చిన్న శివాలయంలో చాళుక్యులశైలిలోని గుండ్రనిపానవట్టం , చిన్న శివలింగం,చిన్ననందులు రెండు, మరొక ఆలయంలో పార్వతి అంశంతో అవతరించి శుంభ , నిశుంభులను వధించిన దేవత 'కౌశికి' బాణం , ధనుస్సు, వజ్రం, నాగపాశాలను ధరించి దర్శనమిస్తున్నది. ఈ దేవత కౌశికీవరప్రసాదలబ్ధులమని చెప్పుకునే చాళుక్యుల దేవత. నృత్యగణపతి , ఆంజనేయుడు కూడా వున్నారు. ఈ ఆలయాన్ని పునరుద్ధరణ చేస్తున్నారు. కాని, పూర్వరూపం మళ్ళీ కనిపించదు. భువనగిరి చెరువు కింద , ఈద్గా

వెనక పచ్చలసోమేశ్వరాలయం వుంది. ఇది నిజానికి త్రికూటాలయం. పునరుద్ధరణలో రూపుమారినా ప్రధాన , ఉపాలయాలు ఒకే కప్పుకిందనే వున్నాయి.ప్రధానాలయం శివాలయం ,ఉపాలయంలో సీతా ,రామ, లక్ష్మణులను ప్రతిష్టించారు.వినాయకు లున్నారు.మరొక చిన్న దేవాలయం ఖిలాకు పడమట రోడ్డువెంట వుంది. అందులో చతుర్భుజుడైన శివుని శిథిలవిగ్రహం వుండడం విశేషం. భువనగిరిలో వందేళ్ళు నిండని కొత్త ఆలయాలు చాలానే వున్నాయి.

ప్రస్తుతం వున్న బైపాస్ రోడ్డుకు ప్రక్కన , ఫ్లై ఓవరుకు కొద్దిదూరంలో దక్షిణంగా వున్న జాలఎల్లమ్మ గుడివుంది. అక్కడ నిరంతరం వూరే నీటివూట వుండేదట పూర్వం. అక్కడ వెలసిన దేవతనే 'జల ఎల్లమ్మ'దేవతగా కొలుస్తారట. దానికి కొద్దిగా పైకి గుట్ట అంచున ఒక పెద్దరాయికి అపూర్వమైన 'కాలభైరవు'ని విగ్రహం చెక్కివుంది. అది రాచకొండలోని భైరవుని శిల్పాన్ని పోలివుంది. భైరోనికుంటలో పడమటదిక్కున వున్న రాతిగుండుపై 9అ. ల ఎత్తున్న మరొక భైరవుడు చెక్కివున్నాడు. భైరవుని కుడి, ఎడమపాదాల కిరువైపుల దిగంబరంగావున్న ఇద్దరు స్త్రీ, పురుషులు (రాజవంశీకులు?) పూజలు చేస్తున్నట్టుగా వుంది. ఇటీవల కోటగోడపరిసరాల్లో మట్టికోసం తవ్వినపుడు 'వటుక భైరవుని' విగ్రహం బయటపడింది.ఖిల్లామీద గుండంలో ,బయట భైరవులు చెక్కివుండడం చూస్తే భైరవారాధకులైన రాచకొండప్రభువులు పాలించినపుడు ఇక్కడ ఈ శిల్పాలన్ని చెక్కించివుంటారనిపిస్తుంది. భువనగిరికి ఆగ్నేయప్రాంతంలో వున్న కొసగుట్టల్లో మొదటిగుట్టపై శివాలయం (బమ్మేశ్వరాలయం?) ,రామాలయం అని పిలువబడే గుహాలయం వుంది. అక్కడ ఒక సహజసిద్ధంగా ఏర్పడిన కొలను వుంది. అక్కడ వున్న రాతిబండలపై చెక్కిన ఆంజనేయుడున్నాడు.







రాయగిరిః

నల్గొండ జిల్లా భువనగిరి మండలం రాయగిరిది ఒక విస్మృత చరిత్ర. ఆ వూరెందుకు రాయగిరయిందో తెలియదు. రాయగిరి రైల్వేస్టేషన్ ప్రాంతాన్ని పూర్వం తిరుమలగిరి తండ అని పిలిచేవారని రాయగిరి గ్రామస్తుడు మైదబొయిన అంజయ్య అనే పెద్దమనిషి చెప్పాడు. వెనకటికి అక్కడ వున్న గుట్టకు వెంకటేశ్వర్లు వెలిసినందువల్ల ఆ ప్రాంతం తిరుమలగిరి అయిందేమో.

రాయగిరి నుండి రైలు మార్గం వేసే కాలంలో వందలాది ఆదిమానవుల సమాధులు బయటపడ్డాయి.వాటిలో బృహచ్ఛిలాయుగానికి చెందిన సమాధులెక్కువగా బయటపడ్డాయి. ఈ సమాధులగురించి హైదరాబాద్ ఆర్కియాలజికల్ సొసైటీకి చెందిన డా. ఈ. హెచ్. హంట్ అనే బ్రిటిషరు రాయల్ ఆంత్రోపాలజికల్ ఇన్స్టిట్యూట్ జర్నల్

(వాల్యూమ్-LIV)లో 'హైదరాబాద్ కైరన్ సమాధులు-వాటి ప్రాముఖ్యత' అనే వ్యాసంలో రాసారు. ఈ సమాధులలో దొరికిన గాజుపూసలు ఇక్కడి పదార్థంతో చేసినవి కాదట. అవి ఆఫ్ఘనిస్తాన్ లో లభించే లాపిస్ తో చేయబడినవట. ఇక్కడ తవ్వకాలు జరిపిన సమాధులనుండి రెండు పురుషుల అస్థిపంజరాలు , కొన్ని స్త్రీల అస్థిపంజరాలు. . . అందులో ఒకటి చిన్నమ్మాయి అస్థిపంజరంతో పాటు ఆ పూసలు దొరికాయట. ఆ సమాధులలో ఒక్కొక్కటి 20 మందిని ఖననం చేసేంత పెద్దవి కూడా వున్నాయి. టన్నుల కొద్ది బరువైన కప్పుబండలతో, ఒక వరుస లేదా రెండు వరుసల గుండ్రాళ్ళ వర్తులాలతో ఈ రాక్షసగుళ్ళు లేదా రాకాసిగుళ్ళు లేదా మెగాలిథ్స్ లేదా బృహత్సమాధులున్నాయి (వుండేయి. . ఇపుడన్నీ తొలగించబడ్డాయి) .

వీటి నుండి లభించిన వస్తుసామగ్రిలో గంటలు , పళ్ళాలు, ఆభరణాలు విరిగిన రూపంలో రాగివస్తువులు దొరికాయి. ఇనుప ఆయుధాలు, గుర్రపు స్వారీకి పనికొచ్చే రికాబులు , అమ్ముల ములుకులు, కత్తులు, ఈటెలు, గొడ్డళ్ళు, త్రిశూలాలు ఎక్కువగా దొరికాయి. ఇక్కడ దొరికిన మట్టిపాత్రలు గోధుమ , ఎరుపు రంగులలో వున్నాయి. వీటి మీద ఈజిప్టులో పాత్రల మీద వున్నట్టుగా 'క' గుర్తులున్నాయి. ఈ అక్షరం కుండ చేసినపుడు రాయలేదు. ఈ గుర్తులు తర్వాత కుండల మీద గుర్తులుగా గీరినట్టు తెలుస్తున్నది.

ఒకప్పుడు నైజాంరాజ్య ఆర్కియాలజీవారు యాజ్దాని మరియు ఈహెచ్. హంట్ , మున్న్ (1924)వంటి బ్రిటిష్ వారు చేపట్టిన తవ్వకాల వల్ల సింధునాగరికతతో సరిపోలె నాగరికసంస్కృతి అక్కడి సమాధులలో బయటపడింది. ఈ సమాధులు చరిత్రపూర్వదశకు చెందినవని , అయో (ఇనుప)యుగానికి చెందినవని ఎం. ఎల్. కె. మూర్తి గారు రాసారు.

రాయగిరి సమాధులను 1938లో తవ్వించిన యాజ్దాని , ఇవి చాలా అపూర్వమైనవని వీటి సంస్కృతి సింధునాగరికత కన్న ముందరిదని తన నివేదికలో రాసాడు.ఇంత చరిత్రను మనం విస్మరిస్తున్నాం.
కాపాడుకోవలసిన బాధ్యతకూడా మనదే కదా.

రాయగిరికోటః

రాయగిరి చరిత్ర అసంపూర్ణంగానే వుంది. తిరుమలగిరి గుట్టకు పడమట వున్న మల్లన్న గుట్ట మీద ఒక పురాతన చరిత్ర మరుగునపడి వుంది. రాయగిరి రైల్వే స్టేషన్ కు పడమరగా , ఫ్లై వోవర్ మొదలయేచోట వున్న మల్లన్నగుట్ట వుంది. మల్లన్నగుట్ట ఒక అద్భుతం. పురాతనస్మృతుల విషాదం. తూర్పు దిశ మధ్యలోనే కోట గోడ కనిపిస్తుంది. ఇది మట్టిగోడ. చిన్న చిన్న రాళ్ళని కడుపులో పెట్టుకున్న పెద్దరక్షణ కవచం. అక్కడికి దగ్గరలో చేదబాయికోట వుంది. కోటగోడ మూడు ప్రాకారాలుగా వుంది. ఒకటిః మట్టిగోడ , రెండవదిః చెక్కిన పెద్దరాతిబండలతో రెండవ వరుస కోటగోడ. మూడవది చక్కగా గోడలకోసం చెక్కిన రాతిబిళ్ళలతో కట్టిన గోడ. సరిగా కోట మధ్యలో మల్లన్నగుడి. మల్లన్నగుడి రాతిద్వారం రెండు శేరలమీద కలశాలు వున్నాయి. ఇది జైనబసది లేదా గుడికి వుండే గుర్తులు. అంటే మొదట జైనదేవాలయంగా వున్న ఈ గుడి తర్వాత శివాలయంగా మార్చబడిందన్నమాట. గుడి ముందు వినాయకుడు , తలలేని నంది , ఆంజనేయుడు వున్నారు. గుడికి దగ్గరలో రెండు సహజసిద్ధమైన నీటికుండాలున్నాయి. ఒకదానిలో నిరంతరం తామరలు వుండేవి. వర్షాభావం వల్ల తామరలను చూడలేకపోయాం. అట్లే అక్కడికి దగ్గరలో వుండే 'దూసరి వద్లు' పండే మరో కుండం చూసాం. నీళ్ళులేక ఆ కుండం కళతప్పింది.

కోటకు నైరుతిలో రెండురాతిగుండ్ల నడుమ చిన్నసొరికెలో వెలసివున్న నరసింహస్వామిని చూసాం.కోటగోడ దాదాపు 30 కిలోమీటర్లవిస్తీర్ణంలో కట్టబడివుంది. కాని ఇపుడు కనిపించేవి కోట శిథిలాలే. 7 లేదా8 కి. మీ. పొడవు , 5 కి. మీ. ల వెడల్పుండే గుట్టపై మైదానప్రాంతం 40 కి. మీ. ల వైశాల్యంతో వుంది. నాలుగుకొలనులు , ఎన్నో నివాసగృహాల ఆనవాళ్ళు కనిపించాయక్కడ. అంతేకాదు , శాతవాహనులవా లేక విష్ణుకుండినులవా (?) ఇటుకలు దొరికాయక్కడ. బౌద్ధస్తూపనిర్మాణం ఆనవాళ్ళు మరియు ఇతర బౌద్ధ ఆరామాలవంటి నిర్మాణాలలో కనిపించే ఇటుకలతో కట్టిన తొట్లు అక్కడక్కడ కనిపించాయి. రాయగిరికోట భువనగిరికోట కన్నా ముందే నిర్మాణం చేసినకోట. ఇక్కడి కోట నిర్మాణం , భవనాల కట్టుకం , కుండాల నిర్వహణ, దేవాలయాలు, స్తూపాలవంటి నిర్మాణాలు. . . ఇవన్నీ ఈ రాయగిరి కోట విష్ణుకుండినుల కాలం లేదా అంతకన్నా ముందే ఇక్కడ కట్టివుంటారని తెలుస్తున్నది.

అంతేకాదు బౌద్ధులలో ఏర్పడ్డ చైత్యక,అపరశైలీయుల, రాజగిరీయుల శాఖలలో ఒకటైన రాజగిరీయశాఖ కేంద్రం రాయగిరేనని చీమకుర్తి శేషగిరిరావుగారు అభిప్రాయపడ్డారని తిరుమల రామచంద్ర గారు(ఆంధ్రపత్రిక,1982)రాసారు.ఇక్కడ అగుపిస్తున్న స్తూపాల ఆనవాళ్ళు వారి అభిప్రాయాన్ని బలపరుస్తున్నాయి.

హైద్రాబాద్ హుస్సేనుసాగరులోని రాక్ జిబ్రాల్టర్ మీద ప్రతిష్టించిన బుద్ధవిగ్రహానికి రాతిని తొలిచినచోట రాయగిరిగుట్ట (తిరుమలగిరిగుట్ట) పై రామాలయం వుంది. అక్కడ పురాతనకాలంలో దేవాలయం వుండేదనడానికి గుర్తుగా ఒక రాతిగుండుకు చెక్కిన ఆంజనేయుడు, వైష్ణవదేవాలయ ద్వారపాలకులవి రెండు శిల్పాలు ,

మట్టిబాటకు అవతల పడివున్న ధ్వజస్తంభం ,దానిపై కూర్మం , ఆంజనేయుడు,ఒక భక్తురాలి శిల్పాలు చెక్కివున్నాయి. రాయగిరి రైల్వేస్టేషనుకు వెనకవైపు వున్న వెంకటేశ్వరునిగుట్ట మీద వెంకటేశ్వరుని గుడివుంది. గుడికి ఎదురుగా వరుసగా ఎన్నో శిల్పాలు , నిర్మాణాలున్నాయి. అవన్నీ ఈ గుడికి చెందినవే.గుట్టమీద నేలకు 60అడుగుల ఎత్తున గుడివుంది. గుడినిర్మాణం 15 , 16వ శతాబ్దాలకాలంనాటి దేవాలయనిర్మాణశైలిలో వుంది. వైష్ణవమతచిహ్నాలు అంతటా కనిపిస్తుంటాయి.గుడికి మరి 20అడుగుల ఎత్తునవున్న రాతిగుండుమీద గండదీపం పెట్టే గూ టినిర్మాణం వుంది. జాతర లేదా ఉత్సవం సందర్భంగా ఇక్కడ వెలిగించే దీపం చుట్టూ గ్రామాలకు కనిపిస్తుందట.యాదగిరిగుట్ట దేవాలయాన్ని చూస్తున్నట్టుగావుండే ఈగుడిలో వుండాల్సిన విగ్రహాలు,అర్చనామూర్తులు రాయగిరిగ్రామంలోని వెంకటేశ్వరుని గుడిలో వుంటాయట.పండుగ చేసినపుడు ఆ విగ్రహాలనిక్కడపెట్టి ఉత్సవం చేస్తుంటారట. గుడిలోని వెనకరాతిగోడకు తిరునామాలకు దీపార్చన జరుగుతున్నట్టు వుంది. గుడిలో గర్భగుడి , అంతరాళాలున్నాయి. గుడికి 40 అడుగులు కిందుగా ఒక రాతిగుండుకు చెక్కిన ఆంజనేయుడు,గరుడుడు,పన్నిద్దరు (12)ఆళ్వార్ల శిల్పాలున్నాయి. అక్కడ కొంతభాగం ఇటుకల నిర్మాణం వుంది.కాని ,నిధుల తవ్వకందార్లవల్ల అంతా చెదిరిపోయింది. ఆ ఇటుకలు విష్ణుకుండినుల కాలంనాటివివలె పెద్దవిగావున్నాయి. నునుపుగా వున్నాయి. సరిగ్గా గుడికి ఎదురుగావున్న ఎత్తైన రాతిచప్టానిర్మాణం మీద ఒకధ్వజస్తంభం , దానిమీద వైష్ణవదంపతులు , గరుడుడు, హనుమంతుని శిల్పాలున్నాయి. అక్కడే భక్తాంజనేయుని శిల్పంకూడా వుంది. అక్కడికి దిగువన మూడు ధ్వజస్తంభాలు వాటిపై నాగ , కూర్మ, ఆంజనేయ శిల్పాలున్నాయి. అక్కడే

రెండుగుళ్ళున్నాయి. అందులో ఒకటి ఆంజనేయునిది. మరొకటి రంగనాయకుని (గతంలో భావించినట్టు అనంతపద్మనాభునిది కాదు) ది. అక్కడికి దూరంగా రైలుదారికి అవతల చతురస్రాకారంలో 50కంటె ఎక్కువ మెట్లతో నిర్మించిన కొలనువుంది. దానికి చేరువలో కళ్యాణమంటపం వుంది. అక్కడికి కొంచెం దూరంలో శిథిలశివాలయం ఆనవాళ్ళు శివలింగం, పానవట్టాలు, ద్వారపాలికల శిల్పాలున్నాయి.












మూటకొొండూరుః

నల్లగొొండ జిల్లా యాదగిరిగుట్ట మండలంలోని మూటకొొండూరు ప్రాచీనగ్రామం.ఇక్కడ నవీనశిలాయుగంనాటి ఆదిమానవుల సమాధులు న్నాయి.చారిత్రకకాలంలో ఇక్కడ యుద్ధాలు జరిగివుంటాయేమో. అందుకనే కావొచ్చు పదులకొద్ది వీరగల్లులు న్నాయిక్కడ.ఒక వీరగల్లు మీద వున్న తెలుగులిపి కాలం 7, 8 శతాబ్దాలనాటిది. వీరగల్లులను ఇక్కడి శివాలయం ముందర చేర్చినట్టుంది. పెద్ద శివాలయం వెనక మరొొక చిన్నశివాలయం కూడా వుంది. శివాలయం ముందరి ద్వారమంటపం

రెండం తస్తుల్లో వుంది. ఇట్లాంటి మంటపాలు అరుదుగా వున్నాయి. వలిగొండ నాగారం శంకరంగుట్ట దగ్గర పంచలింగేశ్వరాలయం ముందర,మెదక్ జిల్లాలోని దుద్దెడ , సిద్దిపేటల్లో ఇటువంటి ద్వారమంటపాలను చూడవచ్చు.విష్ణుకుండినుల కాలంలో రామలింగేశ్వరాలయాలు నిర్మించబడ్డవని చరిత్ర చెపుతున్నది. ఈ శివాలయనిర్మాణం కూడా పురాతనమైనదే. కాని చాలాసార్లు పునరుద్ధరించ బడ్డట్లుంది.ఆలయానికి అర్ధమంటపం చిన్నదిగా వుంది. ముఖమంటపద్వారానికి ఇరువైపుల పూర్ణకుంభా లున్నాయి. లోపల అర్ధమంటపంలో రంగమంటపం వుంది. ఎనిమిది స్తంభాలున్నాయి. అంతరాళద్వారానికి రెండువైపుల సర్పాలు , గదలను (లగుడాలా ?) ధరించిన రెండు చేతులున్న ద్వారపాలకు లుండడం విశేషం. గర్భగుడిలో చతురస్రాకారపు పానవట్టం మీద శివలింగం ప్రతిష్టితమై వుంది. గుడిముందర పూర్తిగా చెక్కని నల్లరాతినంది వుంది. దేవాలయ ప్రాంగణంలో చతురస్రాకారపు పానవట్టం మీద చిన్నశివలింగం , కొన్ని నాగశిల్పాలున్నాయి. గుడివెనక నాలుగడుగుల ఎత్తున్న శివునిగుడిలో రెండడుగుల ఎత్తున్న శివలింగం , చతుర స్రాకారపు పానవట్టంపై ప్రతిష్టించింది. గర్భగుడి తప్ప వేరే నిర్మాణం లేదు. దేవాలయద్వారానికి ఇరువైపుల ద్వారబంధాలపై వున్న కలశాలు ఇది జైనమని చెప్పడానికి నిదర్శనం. ఈ గుడిలో శివలింగ ప్రతిష్ట తర్వాతికాలంలో జరిగినట్టు తెలుస్తున్నది. ఈ దేవాలయాల ప్రాంగణానికి ఈశాన్యాన మరో రెండు దైవస్థానాలున్నాయి. ఒకటి విశ్వ కర్మమందిరం. మరొకటి అమ్మదేవతలప్రాంగణం. అర్ధగోళాకారపుగోడలో ఏర్పరిచిన తట్టులో ఐదుశిల్పాలున్నాయి. ఎడమనుండి కుడికి ఒక శైవాచార్యుని ( ?) విగ్రహం, రెండోది ముంగిస వాహనం , చతుర్భుజి, ఖడ్గం, ఢమరుకం ,

త్రిశూలం, పానపాత్రలతో ఎడమపాదం భూమికానించిన ఆసనస్థితిలో వున్న అమ్మదేవత చండిక , మూడోది నక్కవాహనం , చతుర్భుజి, ఖడ్గం, ఢమరుకం , త్రిశూలం, పానపాత్రలతో కుడిపాదం నేలకానించిన ఆసనస్థితిలో చాముండ, నాలుగోది ఏనుగు వాహనం , చతుర్భుజి, ఖడ్గం, ఢమరుకం, త్రిశూలం, పానపాత్రలతో ఎడమపాదం నేలకానించిన ఆసనస్థితిలో ఐరావతి , ఐదోదిచతుర్భుజుడు, బలిఖడ్గం, ఢమరుకం, త్రిశూలం, కపాలపాత్రలతో నగ్నభైరవుడున్నారు. ఈ విగ్రహాలు ఆనాటిప్రజల విశ్వాసాలను ప్రతిఫలించే మూర్తిమత్వాలు. అవి శక్త్యారాధన, భైరవారాధనలకొరకు అప్పటి వారు జైన , బౌద్ధమతాలకు ప్రతిగా, వ్యతిరేకంగా నెలకొల్పిన ఆరాధనాస్థలాలు. అందుకే జైనబసదులు శివాలయాలుగా పరివర్తింప బడ్డాయి. ఇక్కడ గ్రామం మధ్యలో వందేళ్ళకిత్రం కట్టిన రామాలయం వుంది. చెరువు దగ్గర శిథిలవిగ్రహాలు పోగులుపడివున్నాయి. మూటకొండూరు కాటేపల్లిల నడుమ చిన్నఒర్రెఒడ్డున గాజులపరిశ్రమ ఆనవాళ్ళున్నాయని గ్రామస్తులు చెప్పారు.







**చందుపట్లః**

కళ్యాణీచాళుక్యులు కొలనుపాక (ఉప) రాజధానిగా క్రీ. శ. 973 నుండి రెండవతైలపుని నుండి క్రీ. శ. 1156 రెండవ జగదేకమల్లుని వరకు పరిపాలించారు. ఆ తర్వాత కూడా కళ్యాణీచాళుక్యులు కొంతకాలం పాలకులుగా వున్నప్పటికీ అది గణనీయం కాదు. కళ్యాణీచాళుక్య చక్రవర్తి త్రిభువనమల్లుడు ( 1076–1126) ఇప్పటి భువనగిరిపై గొప్పదుర్గాన్ని నిర్మింప జేసాడు.అతని తర్వాత కుమారసోమేశ్వరుడు లేదా భూలోకమల్లుడు ( 1126–1138), రెండవ జగదేకమల్లుడు ( 1138–1156)చక్రవర్తులైనారు. భువనగిరిలో త్రిభువనమల్లుని కాలంలో మహాప్రధాన, దండనాయకులుగా తొలుత మల్లచమూపతి తర్వాత అతని కొడుకు విద్ధమయ్య భువనగిరి దుర్గాధిపతులైనారు. విద్ధమయ్య లేదా విద్ధమరసరు భువనగిరికి సమీపంలోని చందుపట్లగ్రామంలో విద్దేశ్వరస్వామిపేర శైవాలయాన్ని నిర్మించాడు. దేవాలయం వెనక కోనేరు తవ్వించి దానికి 'విద్యాధరతీర్థమ'ని పేరుపెట్టాడు. శాసనం (క్రీ. శ. 1115)వేయించాడు. తర్వాత కాలంతో విద్దేశ్వరాలయ సేవలకు చేసిన భూదానం చేసినట్లు రెండవ చందుపట్ల శాసనం (కాలం తెలియదు) తెలియజేస్తున్నది. ఆ శాసనంలో కళ్యాణీచాళుక్యులు హారీతిపుత్రులని , మానవ్యస గోత్రులని తెలుపుతూ వారి వంశవృక్షం పేర్కొనబడ్డది. ఇటీవల పదిరోజులక్రితం భువనగిరికి వాయవ్యంలో 6కి. మీ. ల దూరంలో వున్న

వడపర్తిలో లభించిన కొత్తశాసనాన్ని(క్రీ.శ. 1156) మా కొత్తతెలంగాణచరిత్రబృందం చదివి పరిష్కరించింది. ఆ శాసనంలో కూడా చాళుక్యులు హారీతిపుత్రులని రాయబడివుంది. అందులోనూ చాళుక్యుల వంశవృక్షం ఇవ్వబడ్డది. వడపర్తిలో ప్రతిష్ఠించిన స్వయంభూ కందర్పేశ్వరాలయానికి విద్దమయ్య చేసిన భూదాన ప్రశస్తి ఈ శాసనంలో పేర్కొనబడ్డది. చందుపట్లశాసనం , వడపర్తిశాసనాలవల్ల క్రీ. శ. 1115 నుండి 1156 వరకు త్రిభువనమల్లుడు , రెండవ జగదేకమల్లులకాలంలో భువనగిరి దండనాయకుడిగా విద్ధమయ్య వున్నాడని తెలుస్తున్నది. చందుపట్లలో విద్ధేశ్వరాలయం , దానినానుకుని చందలారాణి కోసం నిర్మించిన భవనం భువనగిరి కోటగోడల ప్రాకారాన్ని తలపించేవిధంగా వున్నాయి. చాలా పెద్దదేవాలయప్రాంగణం అందులో ప్రధానాలయం , దానికి అనుబంధంగా ఉపాలయాలు చక్కగా నిర్మించారు. వాటిపై గజలక్ష్మి లలాటబింబాలుగా వుంది. గుడికి ఈశాన్యాన కోనేటిజాడలుగా కలశాలున్న రెండుద్వారబంధాలు ,రాతిస్తంభాలు,ఇతరశిథిలాలు మిగిలివున్నాయి.ఒక్క శిథిలదేవాలయంలో సూర్యుడు ,నాగదేవతల విగ్రహాలు మిగిలి వున్నాయి. దేవాలయం ప్రాంగణమంతా ముండ్లచెట్లతో నిండిపోయివుంది.చందలారాణి భవనం కూలిపోయివుంది. గోడలు మిగిలాయి.ఆషాఢంలో జరిగే బోనాలపండుగపుడు పోచమ్మను (దుర్గను) ఆ కోనేటికి తెచ్చి స్నానాలాడించి , వడిబియ్యాలుపోసి పండుగ మొదలుపెట్టే సంప్రదాయం ఇప్పటికీ కొనసాగు తున్నదని గ్రామస్తులు చెప్పారు.వూర్లో రామాలయం , అమ్మదేవతల గుళ్ళు , నాగశిల్పాలు వున్నాయి.






*సైదాపురం:*

నల్లగొండ జిల్లా, యాదగిరిగుట్ట మండలానికి 5కి. మీ. ల దూరంలో వున్న గ్రామం.నల్లగొండ జిల్లా శాసనసంపుటిలో సైదాపురం పేరన 3 శాసనాలున్నాయి. కళ్యాణిచాళుక్య చక్రవర్తి జగదేకమల్లుడు పొట్లచెరువు (పటాన్ చెరు) నెలవీడులో వున్నపుడు , ఆలేరు పక్కనవున్న గ్రామం ఇక్కుర్తిలో దిగంబరజైనంలోని యాపనీయశాఖకు చెందిన గురువు , శస్త్రశాస్త్రనిష్ణాతుడు,నరవైద్యవర,ప్రాణాచార్య బిరుదాంకితుడు అగ్గలయ్యకు 1034 జూన్ 4న ఇక్కుర్తిలోని వైద్యరత్నాకర జినాలయానికి , ముచ్చెనపల్లిలోని బుద్ధసేనజినాలయానికి చేసిన దానశాసనం సైదాపురంలోని పెద్దవాగు ఒడ్డున మట్టికోట గోడపక్కన జైనమానస్తంభంపై చెక్కబడివుంది. ఈ మానస్తంభం 20 అడుగుల ఎత్తుంది. స్తంభం మొదట నాలుగువైపుల శాసనం చెక్కబడ్డది. రెండవది కూడా మొదటి శాసనానికి దగ్గరలోని చెలకలో వుంది. మూడవది 17వ

శతాబ్దానికి చెందిన శాసనం. సైదాపురం అనే గ్రామనామం గురించి విరువంటి గోపాలకృష్ణ గారు సైదా అంటే నాగలి అని ఈ అర్థంతో వున్న ఈవూరు అతిప్రాచీనమైనదని అన్నారు. సాధారణంగా నదులు ఉత్తరవాహినులైనచోట బౌద్ధానికి సంబంధించిన స్తూప , ఆరామ, చైత్యాలేవో ఉండడం సాధారణం బిక్కేరు ఒడ్డున. కాని ఇక్కడ జైనం వుండడం విశేషం. జైన మానస్తంభం వున్నచోట జైనమహావీరుని విగ్రహపీఠం (సింహచిహ్నాలతో) పడివుంది. స్తంభానికే శాసనం చెక్కివుంది. జినుని విగ్రహం ఎక్కడుందో దొరకలేదు. ఇక్కడి శివాలయం ఒకప్పటి శైవమఠం. గర్భగుడి ఉత్తరాశి మీద లలాటబింబంగా లింగం , ఇరుపక్కల సూర్యచంద్రులుండడం అరుదైన విశేషం. వీరశైవం విజృంభించిన కాలంలో కట్టినదై వుంటుంది. ప్రస్తుతగ్రామానికి పడమట వీరభద్ర త్రికూటాలయం వుంది. ఆలయపాలకుడుగా బలభద్రు ( ?) డుట వున్నాడు. ఆలయనిర్మాణం జైనత్రికూటాన్నే పోలివుంది. ప్రధానాలయం శివాలయం. దక్షిణ ఉపాలయంలో వీరభద్రుడు , ఉత్తర ఉపాలయంలో పార్వతి ప్రతిష్ఠితులై వున్నారు.









*బొందుగుల:*

నల్లగొండ జిల్లా రాజపేట మండలంలో బొందుగుల పెద్దగ్రామం. ఎవరి పేరు మీద ఈ వూరి కా పేరు వచ్చిందో ఆధారాలు దొరకలేదు. కాని , గ్రామంలోని ఆలయాలను చూస్తే బొందుగుల చాలా పురాతనగ్రామం అనిపిస్తున్నది. గుళ్ళపంపు అనే పాటిగడ్డ (పాతవూరు) వున్నచోట చాలాపెద్ద త్రికూటాలయం వుంది. అది శివాలయం అని తెలియడానికి మిగిలినవి ప్రధానగర్భాలయంలో చాళుక్యుల కాలంనాటి గుండ్రనిపానవట్టం, చిన్న, శిథిలనంది విగ్రహాలు. విశాలమైన దేవాలయ ప్రాంగణం, త్రికూట దేవాలయంలోని గుడుల ద్వారబంధాలపై కలశాలు , గజలక్ష్మి లలాటబింబాలున్నాయి. త్రికూటంలోపల రంగమంటపం , అర్ధమంటపాలతో విశాలంగా వుంది. ఆనుకునివున్న ముఖమంటపం డంగుసున్నం, పలుగురాళ్ళు కలిపివేసిన కప్పు (డాబా) తో చెక్కుచెదరకుండా వుంది. లోపలి గుళ్ళకు పైన ఇటుకల విమానాలున్నాయి. ఆ ఇటుకలు 14’8’3’ అంగుళాల కొలతలతో వున్నాయి. గుడి ఉత్తరాన వున్న బావి ఒకప్పుడు కోనేరేమో. గుడి బయట ఒక వీరశిల వుంది. మరొక విరిగిన స్తంభశిలకు కలశం చెక్కివుంది.

పునరుద్ధరణ చేసిన శివాలయం వూరికి వాయవ్యాన వుంది. ఈ శివాలయం ఒకప్పుడు శైవులమఠమై వుండాలి. గుళ్ళపంపు దగ్గరి విగ్రహాలను ఇక్కడికి చేర్చారేమో తెలువదు. గుడి ముందర వీరభద్రుడు , దుర్గ, వింజామరతో ఒక పరిచారిక శిల , వినాయకుడి శిల్పాలున్నాయి. లింగం, పానవట్టం కాకతీయశైలిలో వున్నాయి. గుడికి ఈశాన్యాన కోనేరు, కోనేట్లోకి మెట్లు , దుస్తులు మార్చుకునే గదులున్నాయి. ఈ కోనేటినుండే వ్యవసాయానికి నీరుతోడిన గుర్తుగా రాతితెట్టె ,

మోటదారులు మిగిలివున్నాయి. గ్రామం నడుమ పాతకచేరీ ముందర వేణుగోపాలస్వామి గుడి వుంది. గుడిముందరి స్థలంలో రెండుదీపస్తంభాలుండడం విశేషం. గుడికి ధ్వజస్తంభం కర్రతో చేసివుంది. గుడిప్రాంగణంలో రాళ్ళతోకట్టిన చేదబావి వుంది. ఇప్పటికీ నీరుపైకే వుండడం మరోవిశేషం. గర్భగుడికి తాళం వుండడం వల్ల వేణుగోపాలస్వామి విగ్రహం చూడలేకపోయాం. బయట బృహచ్ఛిలపై ఆంజనేయునిశిల్పం ఎక్కడాలేనంత పెద్దదిగా వుంది. దానికి చేసిన తొడుగు గుడిమంటపంలో వుంది. గుడిపైని విమాననిర్మాణం 16 వ శతాబ్దం నాటిదనిపిస్తున్నది. దానికి పక్కన వుండే సత్రం కూలిపోయివుంది. గుడిముందర పూలపొదల్లో అనూరుడు మాత్రమే కనిపిస్తున్న సూర్యుని అధిష్టానపీఠం మట్టిలో కూరుకునిపోయివుంది. మరొకచోట గరుడాళ్వారు విగ్రహం వుంది. ధ్వజస్తంభం గద్దెగూటిలో మరోగరుడాళ్వారు శిల్పముంది.

వూరికి దక్షిణాన వున్న తొగుడ వేంకటేశ్వరాలయం ప్రత్యేకం. వెంకన్న మట్టిపుట్టరూపంలో వెలిసాడు. అర్చామూర్తులను వేరే తయారు చేయించిపెట్టారు. గర్భగుడి ద్వారపాలక విగ్రహం 16వ శతాబ్దకాలపు శైలిలో వుంది. గుడికి ఆనుకుని ధర్మశాల వుంది. ప్రస్తుతం 14గో తరం పూజారి శ్రీధరస్వామి గుడిని నిర్వహిస్తున్నాడు.

వూరిలో 86 ఏళ్ళ కిందట కట్టిన జామామసీదు కచేరీప్రాంతంలోనే వుంది.

వూరికి ఆగ్నేయాన వున్న చిన్నబోడు మీద పులిదొనెవుంది. ఒకప్పుడు అందులో పులిజాడ వుండేదని , ఆ చుట్టుపక్కల కొత్తరాతియుగపు నాటి రాతిపనిముట్లు లభించేవని అక్కడ టీచరుగా పనిచేసిన విరువంటి గోపాలకృష్ణగారు చెప్పారు.







***కొన్నె:*** బొందుగులకు దగ్గరలో వున్నగ్రామం కొన్నె , వరంగల్ జిల్లా బచ్చన్నపేట మండలంలో వుంది ప్రస్తుతం. లభిస్తున్న ఆధారాల ప్రకారం కొన్నె ఒక ప్రాచీనగ్రామం. కొన్నెగ్రామానికి ఉత్తరాన చెరువుంది. ఆ చెరువును గోనె చెరువని పిలుస్తారు అక్కడి ప్రజలు. అక్కడున్న కట్టమైసమ్మను గోనెకట్టమైసమ్మ అనే పిలుస్తారు. గోనె ఆ వూరునేలిన వారి వంశనామం కావచ్చు.ఆ గోనె రానురాను కొన్నెగా కుదించుకుపోయుండొచ్చు.దానితో ఈవూరుకు కొన్నె అనే పేరువచ్చివుంటుంది. ఈ గ్రామం వెయ్యేళ్ళ కింద కొత్తగా కట్టిన వూరు కావడానికి అవకాశముంది. పాతవూరు వేరేచోట వుండేదని గ్రామస్తులు చెపుతున్నారు. ఈ వూరుకు పాతవూరు పాటిగడ్డవుందని పాతశివాలయం

అక్కడిదేనంటారు. ఆ శివాలయం పురాతనమైనది. అది శివాలయంగా మార్చబడక ముందు జైనబసది అయివుంటుందని ఆ ఆలయగర్భగుడి ద్వారబంధాల మీదున్న కలశాలొక నిదర్శనం , అట్లే ఆలయం ప్రధానద్వారం దక్షిణాభిముఖంగా వుండడం మరొక కారణంగా చెప్పొచ్చు. ఇపుడు గర్భగుడిలో ఎత్తైన పానవట్టం మీద శివలింగం వుంది. దేవాలయం విమానగోపురం తర్వాత కాలంలో నిర్మించినట్టుగా తెలుస్తున్నది. మొదట రాళ్ళు పరిచి సున్నం , పలుగురాళ్ళ కాంక్రీటుతో చేసిన దేవాలయం కప్పు మీద పాలాస్త్రి వంటి ఇటుకలతో , రాళ్ళతో విమాన నిర్మాణం చేయబడ్డది.దేవాలయపు అర్ధమంటపం తూర్పుదిశరాళ్ళ మధ్య ప్రతిష్టించిన ఉమాసహిత దక్షిణామూర్తి కొలువైనాడు. అది కూడా మధ్యలో చేసిన పనే. ఆ పక్కన తలలేని రాజోచిత వేష , భూషణాలతో ఒక శిల్పం వుంది. బహుశః అతడు దేవాలయ నిర్మించిన రాజగునేమొ. గుడి వెనక ఒక వీరగల్లు , రెండు ఆడ, మగ నాగ విగ్రహాలు వున్నవి. మరికొన్ని భూమిలో వున్నవి. గ్రామంలో రామాలయం ప్రసిద్ధం. రామాలయంలోని సీతారామ లక్ష్మణుల విగ్రహం సుందరంగా వుంది. ఆలయం కప్పుమీద అగ్నిదేవుని శిల్పమొకటి లభించింది. గ్రామంలోని మరొక శివాలయంలో చిన్న గర్భగుడిలో శివలింగం, బయట భైరవుడున్నారు. ఆ గుడి ముందర తక్కువ గ్రామాల్లో కనిపించే సారగమ్మ విగ్రహముంది. చెరువులో వీరగల్లుంది. దుర్గమ్మ గుడిదగ్గర భైరవుడు , వీరగల్లు,తలలేని దుర్గ శిల్పాలున్నవి. గ్రామపంచాయతి దారిలో ఏనుగులను కట్టేసే రంధ్రమున్న రాతి స్తంభముంది. ఇట్లాంటిది నల్లగొండ జిల్లా ఆత్మకూరు మండలం చాడలో వుంది. ఆంజనేయుని గుళ్ళు చాలా చోట్ల వున్నవి. పాత శివాలయం దారిలో పానవట్టంతో శివలింగం , నంది, ముందర హనుమంతుడు

(ప్రాచీనశిల్పం)వున్నవి.గ్రామంలో పాతగడి ఆనవాళ్ళే కాక వూరిచుట్టూరా కట్టిన గోడ శిథిలాలు కనిపిస్తున్నాయి. గ్రామానికి నైరుతిలో పాతకోట ఆనవాళ్ళు లభిస్తున్నాయి. అక్కడ చాలా రాళ్ళు మట్టిలో కూరుకుని వున్నాయి. వాటిని బయటికి తీస్తే ఇంకా ఎక్కువ సమాచారం దొరికే అవకాశముంది. అక్కడికి కొద్దిదూరంలో దేవుని మాన్యందారిలో చింతచెట్టు కింద నల్లసరపురాతి శాసనం వుంది. దానిమీద సూర్యచంద్రులు, మధ్యలో శివలింగం చెక్కివున్నవి. దానికి పశువులను కట్టేయడంవల్ల అక్షరాలు అరిగిపోయి కనిపించడంలేదు. ఉన్న ఒక్క చారిత్రక లిఖితాధారం దక్కకుండాపోయింది. గ్రామంలోని దేవాలయాలను గమనిస్తే ఇక్కడ రాష్ట్రకూటులకాలం నుండి దేవాలయాలున్నాయని, తర్వాత కాలంలో చాళుక్యులు , కాకతీయులు వాటిని పునరుద్ధరించడం , మార్చడం చేసారని పిస్తున్నది. వూరిలో భైరవులు ఎక్కువచోట్ల వున్నారు. భైరవారాధన ఎక్కువగా కాపాలికులు , పాశుపతుల్లో వుంది. కనుక జైనం , శైవాలకు సంఘర్షణ జరిగివుంటుందనిపిస్తుంది. ఆ సందర్భంలోనే ఆలయాలమార్పు జరిగి వుంటుందనిపిస్తున్నది. గ్రామంలోని ఆ శాసనం తప్పకుండా శైవమతాలకు సంబంధించిందై వుండడానికి అవకాశముంది. వూరిలో చాలాచోట్ల మాన్యాలుగా పిలువబడే పొలాలున్నవి.

కొన్నె , రామచంద్రాపురం గ్రామాలనడుమ వున్న500మీ. ల ఎత్తున్న గుట్ట ఆకారంలో ఏనుగునుపోలివుంటుంది. దీనిని గజగిరిగుట్ట అని పిలుస్తారు. ఒకప్పటి అగ్నిపర్వతమనిపించేలా గుట్టమీద గుండ్లు అనేకం, సొరంగాలు లెక్కకు మిక్కిలి. గట్టిరాళ్ళ కొండ ఇది. క్వారీలో ధ్వంసమైపోతున్నది. గుట్టకు పడమటివైపు కొండనడుమ సహజసిద్ధంగా ఏర్పడివున్న కొలనునే ప్రజలు సూర్యుడు చూడని కుండం అని

పిలుస్తున్నారు. దీనిలోని నీరు తాగితే రోగాలుపోతాయని చెప్పడం ఆ నీళ్ళ స్వచ్ఛతకు, ఖనిజధాతువుల సంపన్నతకు నిదర్శనం. గుట్టకు పడమట , కొన్నెవైపు ఒక పెద్ద పట్టణం వున్న ఆనవాళ్ళు దొరుకుతున్నవి. దర్గా వెనక కోటవంటి నిర్మాణానికి సంబంధించిన పునాదిరాళ్ళచాళ్ళు కనిపిస్తున్నవి. అక్కడ లభిస్తున్న గాజులు , కుండలు, టెర్రకోటబొమ్మల ముక్కలు , నూరుడురాళ్ళు, పెద్ద (14 , 8, 4 అంగుళాల కొలతలు) ఇటుకలు శాతవాహనుల కాలంనుండి ఇక్కడ నగరమొకటి వుండేదనడానికి ఆధారాలు. ప్రజలు ఈ ప్రాంతాన్ని గజగిరి పట్టణం అని పిలుచుకుంటారు.

గుట్టకు నైరుతిన కింద ఒక పడగరాయికి ఆదిమానవులువేసిన రాతిచిత్రాలు కొన్ని దొరికాయి. ఆ పడగరాయిని పగులచీరడంవల్ల రాతిచిత్రాలు దక్కకుండాపోయినవి. వున్నవాటిలో మానవాకారాలు , అస్పష్టంగా జంతువుల బొమ్మలు ఒకటి , రెండు కనిపిస్తున్నవి. ఇట్లాంటి రాతిచిత్రాల ప్రదేశాలు (చిత్రిత శిలాశ్రయాలు రంగారెడ్డిలోని కోకాపేట , తుర్కపల్లి, లాల్ గడి మలకపేట , మెదక్ జిల్లా అస్తలాపూర్ , శివారువెంకటాపూర్, ధర్మారం, నల్లగొండ జిల్లా భువనగిరి మండలంలోని వడపర్తులలో ఒక వరుసలో నెలకొనివున్నాయి. అంటే ఈ ప్రాంతమంతా ఒకప్పుడు ఆదిమానవుల ఆవాసాలని చెప్పవచ్చు. ఈ ప్రదేశాలలో లభిస్తున్న వారి రాతిపనిముట్లను , రాతిగొడ్డండ్లు, కత్తులు, సుత్తెలు, వడిసెలరాళ్ళు, నాగళ్ళవంటి వంపురాళ్ళు , చిల్లరాళ్ళు వంటి వాటిని పరిశీలిస్తే ప్రాచీనశిలాయుగం , మధ్యశిలాయుగం, నవీనశిలాయుగం, బృహచ్ఛిలాయుగాలలో క్రమంగా ఇక్కడే పురాతన మానవావాసాలు సమృద్ధిగావుండేవని తెలుస్తున్నది. గజగిరిగుట్టపైన , కింద రాసులకొద్ది వివిధ రాతియుగాల రాతిపనిముట్లు కొల్లలుగా

దొరుకుతున్నవి. అంటే ఈ గజగిరిగుట్ట కూడా ఆదిమానవులకు ఆశ్రయమిచ్చిన ప్రాచీన చారిత్రకప్రదేశమే. గుట్టపైన గుహల్లో ప్రాచీనశిలాయుగపు మొరటు రాతిపనిముట్లు పలుగురాళ్ళతో , చెకుముకిరాళ్ళతో, పెచ్చురాళ్ళతో చేసిన పెద్దపనిముట్లు లభిస్తున్నవి. కొండపైన, దిగువన మధ్యశిలాయుగపు వడిసెలరాళ్ళు , చిల్లరాళ్ళు, ఒకపక్కన చెక్కిన రాతిగొడ్డళ్ళవంటివి , కత్తుల రూపంలో అనేకంగా రాతిపనిముట్లు దొరుకుతున్నవి. నవీనశిలాయుగానికి చెందిన నునుపైనవి రెండువైపుల చెక్కిన రాతిగొడ్డండ్లు , కత్తులు, నూరుడురాళ్ళే గాకుండా అక్కడక్కడ పలుచని రాతి పనిముట్లు అరుదుగా లభిస్తున్నవి. గుట్టచుట్టూ తొలగించినవి పోగా బృహచ్ఛిలాయుగపు రాకాసిగుళ్ళని జనం పిలిచే సిస్తులు, కైరన్లు విరివిగా కనిపిస్తున్నవి.

గుట్టకు పడమట కిందవైపున కొంచెం ఎత్తునవున్న గుహాలయాన్ని రంగనాయకుని గుడి అంటారు. ఇపుడైతే గుడిలో ఒకప్పుండుండిన సుందర శేషతల్పశాయి రంగనాయకుని విగ్రహం లేదు. ఏమైందో చెప్పేవారు లేరు. గుడికి ఇరువైపుల బండలమీద ఆంజనేయ , గరుత్మంతుల శిల్పాలు చెక్కివున్నవి. వెనకవైపు ఆల్వారులు , చెక్కబోయి నిలిపిన వినాయకుని శిల్పాలున్నవి. ఈ ఆలయపు ఉత్తరాశీమీద లలాటబింబంగా గజలక్ష్మి చెక్కబడివుండడం , ఆలయద్వారం దక్షిణాభిముఖంగా వుండడం చూస్తే ఇది కూడా ఒకప్పుడు జైనబసదికావచ్చుననిపిస్తున్నది. ఆలేరులో వున్న రంగనాయక దేవాలయం కూడా జైనమని చెప్పడానికి అదికూడా దక్షిణాభిముఖ ద్వారమే కలిగివుంది. ఇవన్ని ఒకప్పటి జైన , శైవ, వైష్ణవాల మధ్యపోటీ, ప్రాభవాల వల్లనే జరిగివుంటాయి. గజగిరికొండకు తూర్పున ఆగ్నేయంలో చిన్నగుహలెక్క కనిపించేచోట కపాలభైరవుడు , కొంచెం దూరంలో

చాముండి (లేదా కామాక్షి) శిల్పాలు గుట్ట రాళ్ళకు చెక్కివున్నాయి. ఇవి కాపాలికుల ఆరాధనాస్థలాలని చెప్పవచ్చు.

గజగిరిగుట్టమీద బౌద్ధం: వాయవ్యదిక్కునుండి గజగిరిగుట్టపైకి వెళితే, పైన పెద్ద ఇటుకలనిర్మాణాల శిథిలాలు కనిపిస్తున్నాయి. అక్కడ లభిస్తున్న పెంకులు, ఇటుకల (14, 8, 4 అంగుళాల కొలతలతో) వలయాల వరుసలు , కొన్ని పాలాస్త్రికి వాడే పలుచని ఇటుకలబిళ్ళలు ఆధారంగా ఇది తప్పకుండా బౌద్ధుల ఉద్దేశిక స్తూపమైవుంటుందని చెప్పవచ్చు. ఆ నిర్మాణాలు పక్కన ఏనుగుకుండం , ఆ పక్కన చాలాచోట్ల ఇటుకలచేత కట్టిన నివాసాల (ఆరామాల) ఆనవాళ్ళు, రాతిస్తంభాలు, రాతిపలకలు. . . ఇవన్నీ బౌద్ధుల ఆవాసాలని ధ్రువపరుస్తున్నవి. అంతేగాకుండా కొన్నెవాగు బచ్చన్నపేటవాగులో కలిసి కొలనుపాక వద్ద ఆలేరువాగు (భిక్కేరు) గా మారుతున్నది. ఆలేరువాగుకున్న భిక్కేరనే పేరు ఈ ప్రాంతంలో బౌద్ధులు విహరించారని స్తూపాలు, ఆరామాలు నిర్మించారని (ఉదాహరణకు నల్లగొండ ఆత్మకూరు మండలంలోని చాడ , ఫణిగిరి, తిర్మలగిరులలో బౌద్ధస్తూపాలున్నవి) రాజపేట మండలం రఘునాథపురం రామస్వామిగుట్టకు బౌద్ధం బొమ్మలున్నవి. ఈ వరుసలో గజగిరిగుట్ట కూడా బౌద్ధుల ఆవాసమనడానికి సందేహం లేదు. అక్కడే జనగామ చరిత్రపరిశోధకుడు మిత్రుడు ఆర్. రత్నాకర్ రెడ్డికి మట్టిముద్ర , టెర్రకోట బొమ్మలు లభించాయి.






**వెల్మజాలః**

నల్లగొండజిల్లా గుండాలమండలంలోని వెల్మజాల ఒకప్పటి జైనబసదులగ్రామం. రాష్ట్రకూటుల పాలనలో వున్నగొప్పనగరం. ప్రస్తుతగ్రామానికి ఈశాన్యానవున్న పాటిగడ్డలో జైనబసదులు , ఒక ఆలయపు పునాదులు కనిపిస్తున్నాయి. నాలుగైదుఎకరాల విస్తీర్ణంలో నిర్మాణశిథిలాలు కనిపిస్తున్నాయి. ఇటుకలు , కుండపెంకులు, పునాది రాళ్ళు, గోడలఆనవాళ్ళు పాటిగడ్డ అంతటా అగుపిస్తున్నాయి. ఇక్కడే రాష్ట్రకూటుల రెండవ శాసనం లభించింది. మొదటిశాసనం అమ్మదేవత పోచమ్మ (దుర్గగుడి) ముందు దొరికింది. అక్కడే జైన నిశీధులు

(జైనపాదాలు) వున్నాయి. అందులో వెల్మజాలలోని జైనబసదికి అకాలవర్షుడు, రెండవ కృష్ణునికాలంలో క్రీ. శ. 907 ఏప్రిల్ 1న రాజోద్యోగి రావిచంద్రయ్య చేసిన 100 మర్తురుల భూమి , ఒకతోట దానవివరాలున్నాయి. ఇదే నల్గొండజిల్లా శాసనసంపుటిలో తొలిశాసనం. రెండవశాసనాన్ని ఇంకా పరిష్కరించ లేదు. కాని , లిపినిబట్టి ఇది 10వ శతాబ్దానిదని చెప్పవచ్చు. అదికూడా రాష్ట్రకూటులదే. అందులో జినాలయ ప్రస్తావన వున్నది. కనుక ఇది కూడా జైనబసదికి ఎవరో చేసిన దానశాసనమైవుంటుంది. దీన్నిబట్టి ఈవూరు సుదీర్ఘకాలం రాష్ట్రకూటులపాలనలో వున్నదని చెప్పడానికి వీలవుతుంది. వూరికి వాయవ్యాన ఆరడుగులఎత్తున్న ఒక శిథిలశివాలయం వుంది. అది చిన్నరాతిబోడుమీద వుంది. చతురస్రాకారపు పానవట్టంమీద చిన్నలింగం వుంది. దేవాలయద్వారానికి రెండువైపుల శైవద్వారపాలకుల శిల్పాలున్నాయి. గుడిముందర ఒక వీరగల్లుంది. వీరనారి బాణం సంధించి, విల్లెక్కుపెట్టి వుంది. చక్కని శిల్పం. మరొక వీరగల్లు మొదటిశాసనమున్న పోచమ్మగుడి ముందర వుంది. ఇది ఆత్మాహుతి చేసుకుంటున్న భక్తుని వీరగల్లు. వీటిని చంపుడుగుళ్ళు అని చరిత్రకారులు అంటారు. చెరువులో విరిగిన నల్లరాతివిగ్రహం వుంది. దానికి తలలేదు. ఆసనస్థితిలో వున్న ఈ శిల్పం దండరెట్టలకు నాగాభరణాలున్నాయి. బహుశః ఈ విగ్రహం శైవశిల్పం కావచ్చుననిపిస్తున్నది.

 

 

<u>ఈ పుస్తకరచనకు ఆధారాలు:</u>

1.కొలనుపాక చరిత్ర-శాసనాలు - విరువంటి గోపాలకృష్ణ

2.కొలనుపాకదేవాలయాలు - విరువంటి గోపాలకృష్ణ

3.నల్లగొండ శాసనాలసంపుటి-1,పురావస్తు మరియు మ్యూజియంల శాఖ, తెలంగాణ

4.కొత్త తెలంగాణచరిత్రబృందం,చారిత్రకయాత్రలు (అముద్రితం)

5.కొత్త తెలంగాణ శాసనాలు (కొత్త తెలంగాణచరిత్రబృందం)

కృతజ్ఞతలతో...

ఆలేటికంపణం కథ రాయడానికి ప్రేరణం,మార్గదర్శకం అయిన గురువంటి విరువంటి గోపాలకృష్ణగారికి,

ఈ పుస్తకాన్ని అచ్చేయడానికి ఆర్థికసాయమందిస్తున్న అభిమానవైద్యులు డా. బెజ్జంశెట్టి నాగేందర్(కొలనుపాక) గారికి,

అందరికన్నా ముందుగా వందనీయులు తెలంగాణజాగృతి అధ్యక్షులు కల్వకుంట్ల కవితా మేడమ్ గారికి, ఉపాధ్యక్షులు రాజీవ్ గారికి,ప్రధానకార్యదర్శి నవీన్ చారి గారికి నా కృతజ్ఞతలు.వారి చరిత్రప్రాజెక్టులో మాకు అవకాశం యిచ్చి తెలంగాణచరిత్రను రాసే అవకాశమిచ్చిన కవితగారికి శణార్తి.

నా ఈ చారిత్రకాన్వేషణలో సహకరించిన, ప్రోత్సహించిన ఆత్మీయమిత్రులు మా సుద్దాల అశోకన్న,పెండెం సత్యనారాయణ, ఎం.సుభాస్, సుధాకర్ రావ్,కట్టా శ్రీనివాస్,ఎన్.వేణుగోపాల్(వీక్షణం సంపాదకులు),వేముగంటి మురళీకృష్ణ, వేముగంటి రఘునందనన్న, అహోబిలం ప్రభాకర్,అహోబిలం కరుణాకర్, అరవింద్ ఆర్య, ఆర్.రత్నాకర్ రెడ్డి,మల్లావఝ్ఝల నారాయణశర్మ, సోదరి పద్మజారమణ, స్వర్ణలత, జి.కుమారస్వామి, నట్వా ప్రభాకర్,డా.వీరెడ్డి రంగయ్య,ఎం.విజయకుమార్, బాలరాజు, ఎం.రవినాయక్, కమలాకర్,అపుడు చంటి, ఇపుడు నాగరాజు, నీలరామాంజనేయులు, లింగప్ప, ఎన్నో పుస్తకాలసమాచారాన్ని సమయానికి అందించే కోదాడ రామాచారి గారికి,నాంచర్ల అంజన్న, ఆకవరం మోహనరావు, కైజర్,సమి, ఆలేరు పత్రికావిలేఖరులు కుర్షీద్ మియా, తిరునగరి శ్రీనివాసులు,మాధవరెడ్డి,మల్లన్న,ఎర్ర

జాన్సన్,లింగంగౌడ్,ఇంకా ఇతరదినపత్రికల విలేకరులు, మాధవరెడ్డి, నరేందర్(కొలనుపాక), కొన్నె గ్రామసర్పంచ్ వేముల బాలనారాయణ గౌడ్ , రామాంజ నేయులు ,ఇద్దరు శ్రీనివాసులు మరియు టి.మురళి(నమస్తే తెలంగాణ), ఎం.వీరగౌడ్(ఆంధ్రజ్యోతి), జె.భిక్షపతి(సాక్షి),జి.తిర్మల్ రెడ్డి(ఆంధ్రభూమి) ,సబ్ ఇనస్పెక్టర్ శ్రీనివాసులు గారు బచ్చన్నపేట , పోరెడ్డి శ్రీనివాస్,చిరిగె శ్రీనివాస్, సిద్ధులు వి6,బాలరాజు (నెమిలె), వెంకటేశ్ ఈనాడు,డా.మొరిగాడి లక్ష్మయ్య,తండా వెంకటయ్య (దుప్పల్లి), దామోదరస్వామి(చాడ), లూకాస్,లింగప్ప,రాయగిరి గ్రామస్తులు మైలబోయిన శ్రీశైలం,వీసం ప్రభాకర్ రెడ్డి (రాయగిరి),బండారు జయశ్రీ,శ్రీనివాస్ దంపతులు, ఈనాడు సురేందర్,ఆవుల వినోద్(భువనగిరి),బైరపాకస్వామి (అమ్మనబోలు),అరవింద్(మాటూరు),మంచన మల్లేశం (ఆలేరు), దశమంతరెడ్డి(టీచర్ ఫ్రెండ్),కీ.శే.రాజిరెడ్డి (సోమారం), విద్యార్థినీ, విద్యార్థులు,లింగప్ప,వెంకటయ్య,వి6సిద్ధులు (రఘునాథపురం), కాచారం అంజన్న,నా పాత విద్యార్థులు,కొత్త అభిమానులు, రాజపేటలో ఈనాడు వెంకన్న,సింగ్, నమిలెలో బాలరాజుబావ,గోవర్ధన్ రెడ్డి మరియు గ్రామస్తులు, నేను వెళ్ళిన ప్రతిగ్రామంలో నన్ను ఆదరించి వారివూరి విశేషాలను ప్రేమతో వివరించిన ఆవూరి ప్రజలకు శిరసాభివందనాలు.

నా ఈ అన్వేషణలో, పరిశీలనలో తోడ్పడిన తెలంగాణ ఆర్కియాలజీ అండ్ మ్యూజియమ్స్ డిపార్టుమెంట్ అధికారులు డైరెక్టర్ విశాలాచ్చి మేడం,డిప్యూటి డైరెక్టర్ పద్మనాభం సార్, పూర్వ డిప్యూటి డైరెక్టర్ ఎస్సెస్ రంగాచార్యులు,గ్రంథాలయాధికారి

వై.వీరభద్రరావు,ఆత్మీయమిత్రులు నల్లగొండ,మహబూబ్ నగర్ జిల్లాల ఆర్కియాలజీ ఉపసంచాలకులు పగడం నాగరాజు,ఎపిగ్రఫీ మిత్రుడు లీలాసుబ్రహ్మణ్యం

నా,ఈ నిరంతరయాత్రలకు,అధ్యయనానికి నిశ్శబ్దసహకార మందిస్తున్న నా కుటుంబసభ్యులందరికి,

ఈ పుస్తకం తయారీలో ప్రేమతో సౌజన్యాన్నందించిన నాకిష్టమైన బాపు యశస్వి సతీశ్ కు,

ఈ పుస్తకాన్ని ఇంత అందంగా అచ్చేసిన ప్రింటర్స్.....కు

అందరికి పేరుపేరునా

(నా పరిమితజ్ఞాపకశక్తివల్ల నేను మరిచిన అందరు నన్ను మన్నించాలని కోరుతున్నాను.)

నా ధన్యవాదాలు.

శ్రీరామోజు హరగోపాల్,

ఆలేరు